# నాగానందము

మహాకవి శ్రీహర్ష

విరచితము :

సంస్కృతమునకు ఆంధ్రీకరణము

వేంకటావధాని

శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్ డిపో

రాజమహేంద్రవరము

రూపాయి పావల

# నాగానందము

మహాకవి శ్రీహర్ష
విరచితము:

దివాకర్ల వేంకటావధాని
సంస్కృతమునకు ఆంధ్రీకరణము

శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్ డిపో
రాజమహేంద్రవరము

వెల రూ 1-4-0

# పీఠిక

ఈనాగానందమును రచించినకవి శ్రీహర్షుఁడు. ఈతఁడు యశోవతీప్రభాకరవర్ధనుల ద్వితీయకుమారుఁడు. క్రీస్తుశకము 590ప్రాంతముల నీతఁడు జన్మించినట్లు తెలియవచ్చుచున్నది. ఈమహారాజుచరిత్రమునంతయు బాణుఁడు తన హర్షచరిత్రమునఁ జిరస్థాయిఁ గావించినందున నిందుఁ బ్రత్యేకముగఁ దెల్పవలసిన యగత్యము కానుపింపదు. బ్రాహ్మణమతమునందు ద్వేషములేనివాఁడై బౌద్ధమతసాంప్రదాయముల ననుసరించినట్లు గ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది.

హర్షుని యాస్థానమునఁ బ్రసిద్ధిగాంచినకవులు పెక్కురుండిరి. వారిలో బాణుఁడు, మయూరుఁడు, మతంగుఁడు మొదలగువారు సుప్రసిద్ధులు. మమ్మటుఁడు తనకావ్యప్రకాశమున బాణకవి యీమహారాజువలన విశేషధనమును సంపాదించెనని తెల్పియున్నాఁడు. వైభవమునకుఁదగినట్లు కవిపోషకుఁడగుటయేగాక యీమహారాజుగొప్ప కవియై ప్రసిద్ధిగాంచినాఁడు. ఈతఁడురచించిన నాటకములు మూఁడు. అవి రత్నావళీ ప్రియదర్శికా నాగానందములు. ఇవియేగాక సుప్రభాతస్తోత్రము, అష్టమహాశ్రీచైత్యస్తోత్రము నను రెండు స్తోత్రములుగూడ విరచించినట్లు కన్పట్టుచున్నది.

రత్నావళీ ప్రియదర్శికలు నాటికలు. నాగానందము నాటకము. ఈ మూఁటికిని బరస్పరము పోలికలుకన్పట్టుచున్నవి. ప్రియదర్శిక ముందును దరువాత రత్నావళియు నాపిమ్మట నాగానందమును విరచించెనని పెద్దల యభిప్రాయము. ఈతని తరువాతికవు లీతని ననుకరించినవారు చాలమంది యుండుటచే నీతని ప్రాశస్త్యము వెల్లడియగుచున్నది. నాటకకర్తగా నీతని కగ్రస్థానము లేకపోయినను గవులయందధికుఁ డని మాత్రము చెప్పవలయును. తానుస్వయముగఁ జెప్పుకొనిన ట్లీతఁ డొక నిపుణుఁడగుకవి. కాళిదాసువలె నూహాసామర్థ్య మంతవిశితము కాకపోయినను భావము సులభమై తగినభాషతో నొప్పారుచుండును. శబ్దాలంకారములను విశేషముగ వాడియుంచుటను భావసౌలభ్యమునకు హానిగూర్పలేదు. శృంగారవర్ణనమునందుఁ గచకుచాది వర్ణనమునకుఁ బోక సహృదయరంజకముగా గడుసుపోకలు చూపనేర్చినాఁడు.

ప్రస్తావనమం దీనాటకకథ విద్యాధరజాతకమునుండి గ్రహింపఁబడినదని తెల్పఁబడినది. జాతకము బుద్ధునిగతజన్మములయం దాతఁ డొనర్చినపుణ్యకార్యములు వర్ణించిన కథల్కఁపోవు. ప్రస్తుతము వాఁడుకలోనున్నంతవఱకు దానియం దీవిద్యాధరునికథ కాన్పించుటలేదు. పైశాచీభాషయందు గుణాఢ్యుఁడు రచించిన బృహత్కథకు సంస్కృతమున రెండనువాదములుకలవు. సోమదేవుని కథాసరిత్సాగర మొకటి, రెండవది క్షేమేంద్రుని బృహత్కథామంజరి. ఈ రెండిటియందును రెండుచోట్ల జీమూతవాహ

మనికథ ప్రసక్తమైనది. మొదటికంటె శంఖచూడుని కథ విపులముగా నున్నది. సంకుచితముగా వర్ణింపఁబడినకథయే నాటకమునకు మూలాధారమని తోఁచుచున్నది.

మొదటి మూఁడంకములలోనికథయు, నైదవయంకమున జీమూతవాహనుని తల్లిదండ్రులను బ్రవేశపెట్టుటయు మూలకథనుండి చేసినముఖ్యమగుమార్పులు. ప్రత్యేకముగాఁ గరుణరసము సహృదయరంజకముగా నుండదేమోనని మొదటిమూఁడంకములయందలి శృంగారప్రధానమగుకథ కల్పింపఁబడినది. ఇది నాయకుని త్యాగశీలమును ద్విగుణమొనర్చుటకు సహాయమగుచున్నది. మలయవతిని జీమూతవాహనుఁడు మిగుల గాఢముగఁ బ్రేమించెను. కాని నాగసంరక్షణార్థమై తనప్రాణములనొసఁగుచున్నప్పుడామెను దలఁపోయనైన లేదు. పంచమాంకమున జీమూతవాహనుని తల్లిదండ్రులను బ్రవేశపెట్టుటకూడ దీనికే సాయపడుచున్నది.

నాగానందము మిశ్రరసప్రధానమై యున్నది. మొదటిమూఁడంకములయందలి ప్రధానరసము శృంగారము. మిగిలిన రెండంకములయందును గరుణరసము చూపఁబడినది. కొంతమంది కరుణరసమునకు శృంగార మంగమైయున్నదని తలంతురు. కానియిది సత్యముకాదు. శృంగారకరుణములు రెండును వీరశాంతములకు లోఁబడియున్నవి. నాయకుఁడు ధీరశాంతుఁడు. త్యాగశీలము పురికొల్పిన నాయకుని ధైర్యవృత్తి మనయందు గరుణపుట్టించుచున్నది.

నాగానందము నిజమునకు దుఃఖాంతనాటకము. అలంకారశాస్త్రనియమములు నాటకమును దుఃఖాంతమొనర్చుట కొప్పుకొనవు. అందువలననే గౌరీదేవిని బ్రవేశపెట్టి చివరకు నాయకుని బ్రదికింపవలసివచ్చినది. ఇది యీనాటకమున మాత్రము సమంజసముగనే కాన్పించుచున్నది. నాయకుఁడు విద్యాధరుఁడు. నాయిక సిద్ధాంగన. శంఖచూడుఁడు నాగలోకములోనివాఁడు. గరుడుఁడు దివ్యాదివ్యుఁడు. మొత్తముమీఁద నాటకమంతయు మానవులుకానిపాత్రలతో నిండియుండుటవలన నంత్యమున గౌరీదేవి ప్రవేశించి నాయకుని రక్షించుటయు సమంజసముగనే కాన్పించుచున్నది.

మొదటి మూఁడంకములకును మిగిలిన రెండంకములకు నెచ్చటను సంబంధమే కానుపింపదు. మూఁడవయంకముతో నాటకము ముగిసినను రత్నావళీప్రియదర్శికలవలె నొకనాటికయనిపించుకొనుట కేయభ్యంతరమును లేదు. మొదటిభాగమున రాఁబోవు కథ కచ్చటచ్చట సూచనామాత్రములు కాన్పించుచున్నవి.

గౌర్యాలయమున నాయకీనాయకులు కలసికొని యన్యోన్యప్రేమబద్ధులైకూడ నొకరినొకరు పూర్తిగఁ దెలిసికొనలేదు. తెలిసికొనుటకుఁ బ్రయత్నింపనైనలేదు. పరస్పరవిజ్ఞానము రెండవయంకమున నాయికాత్మహత్యాప్రయత్నమున కడ్డమువచ్చునని కవి యట్టివిజ్ఞానమును కల్పింపలేదనుకొనవలసివచ్చినను నది స్వభావవిరుద్ధముగా

మాత్రము గాన్పించుచున్నది. నాయిక యొక్క యాత్మహత్యాప్రయత్నమును దగినంత కారణమును బురస్కరించుకొనియుండలేదు. నాయకుఁ డింకొక స్త్రీని ప్రేమించినట్లు రూఢికాలేదు. ఆమెను నాయకుఁడు తిరస్కరించినవిషయమును బూర్తిగ నిర్ధారణ కాలేదు. నాల్గవయంకమున శంఖచూడునిదల్లితోఁగూడ నిష్క్రమింపఁజేసినఘట్టము సమంజసముగాలేదు. గరుడుని రాక సన్నిహితమైయున్నప్పుడు తనకొఱకు ప్రాణముల నర్పింపసిద్ధమైయున్న నాయకు నంతవఱకు వలదని వారించి గోకర్ణేశ్వరునకుఁ బ్రదక్షిణ మొనర్చుట వదలిపెట్టుట పాఠకులహృదయమున నాతనికి నాయకునిచే దాను సంరక్షింపఁబడుట యిష్టమేనను సందేహమును బుట్టింపక మానదు.

సంస్కృతమహాకవులయందు శ్రీహర్షుఁ డొకఁడు. ఇదివఱకే నాటకము సుప్రసిద్ధులచే నాంధ్రీకరింపఁబడియున్నను నాటకమునందలిగౌరవమే నాయీప్రయత్నమునకుఁ గారణమైయున్నది. ఇందలి గుణాగుణములు చదువరులే నిర్ణయింపఁ బ్రార్థితులు. సంస్కృతకవులయందు శ్రీహర్షునిస్థానమును నిర్ణయించుటకు సాధనమగునని జయదేవుఁడు రచించిన శ్లోకము నీక్రింద నుదహరించుచు నింతటితో విరమించుచున్నాను.

శ్లో॥ యస్యాశ్చోరశ్చికురనికరః కర్ణపూరో మయూరో
భాసోహాసః కవికులగురుః కాళిదాసో విలాసః
హర్షోహర్షో హృదయవసతిః పంచబాణస్తుబాణః
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ.

ఇట్లు

భవద్విధేయుఁడు

దివాకర్ల వేంకటావధాని.

# నాటకమున వచ్చు పాత్రలు

## పురుషులు

జీమూతకేతువు:—విద్యాధరరాజు

జీమూతవాహనుడు:—(నాయకుడు) జీమూతకేతువు తనయుడు

మిత్రావసువు:—సిద్ధరాజగు విశ్వావసువు కుమారుడు

శాండిల్యుడు:—తాపసుడు సిద్ధరాజ పురోహితుడగు కౌశికుని శిష్యుడు

గరుడుడు:—నాగశత్రువగు పక్షిరాజు

శంఖచూడుడు:—గరుడుని యాహారమునిమిత్తము వాసుకిచే బంపబడిన నాగేంద్రుడు

ఆత్రేయుడు:—నాయకప్రియవయస్యుడగు విదూషకుడు

శేఖరకుడు:—విటుడు. సిద్ధరాజ పరిచారకులలో నొకడు

చేటుడు:—శేఖరకుని భృత్యుడు

కింకరుడు:—నాగరాజ భటుడు

వసుభద్రుడు:—కంచుకి

సునందుడు:—ప్రతీహారి

## స్త్రీలు

గౌరి:—భగవతియగు శర్వాణి

కనకవతి:—(వృద్ధురాలు) జీమూతకేతుని పత్ని

మలయవతి:—(నాయిక) సిద్ధరాజ కుమారిక

చతురిక<br>మనోహరిక<br>నవమాలిక } మలయవతి చేటులు

వృద్ధురాలు:—శంఖచూడుని తల్లి

శ్రీమత్పరదేవతాయైనమః

# నాగానందము

## ప్రథమాంకము

### నాంది

శా. ధ్యానవ్యాజ మి దెవ్వ తెంగుఱిచి చింతాముద్ర? వీక్షింపుమీ
సూనాస్త్రక్షతదేహలన్ క్షణము చక్షుల్ విప్పుమున్ ద్రాతవై
మానం బూనెదె నిర్దయాత్మ యనుచున్ మారాంగనల్ సేయు సే
ర్ష్యానిందోక్తులకున్ జలింపని జినుం డాబుద్ధుఁ డోమున్ మిమున్.

మఱియు,

సీ. నారి బిగించి కర్ణముఁ దాఁకునటు విల్లు
నెక్కు వెట్టిన మరుం డిట్టె నిలువ
నాహతపటహనాదానుసారమ్ముగా
నతనుభృత్యులు నాట్య మాడుచుండ
నదరును బెదరు నొయ్యారంబుఁ జిఱునవ్వు
నెఱపుచు సురకాంత లరయుచుండ
సిద్ధులు సాధ్యులు శీర్షమ్ములన్ వంచి
పులకితగాత్రులై వెలయుచుండ

గీ. నెంత యత్నించినను ధ్యాన మించుకంత
మానక సమాధి నున్న యే మానిచంద్రు
వాసవుఁడు చాల నబ్బురపడుచుఁ జూచె
నతఁడు మిమ్ముఁ గాచుఁగావుత మహరహంబు.

(నాంద్యంతమున)

సూత్ర—అతివిస్తర మెందులకు? ఈ యింద్రోత్సవసమయమున నానాదిగ్దేశాగతులును శ్రీహర్షదేవపాదపద్మోపజీవులు నగు రాజులు నను సబహుమానముగఁ బిలిపించి మాస్వామి యగు శ్రీహర్షదేవుఁ డపూర్వవస్తురచనాలంకృతంబుగ విద్యాధర జాతకమును గ్రహించి నాగానంద మనునాటకమును రచించె నని శ్రోత్రపరంపరగా వినుటయేగాని ప్రయోగింపఁబడుచుండఁ జూడ లేదు. కావున సకలజనహృదయాహ్లాది యగు నా నర పాలునియందలి గౌరవముచే మాయం దనుగ్రహబుద్ధితో నా నాటకమును బ్రయోగింపు మని యాజ్ఞాపించిరి. కావున నేప థ్యాలంకరణమునకుఁ బూని వీరి యీప్సిత మిపుడు నెఱవేర్చె దను— (పరిక్రమించిచూచి) సామాజికహృదయము లాకర్షింపఁ బడిన వని తలంతును. ఏలయన,

చ. కవి నిపుణుండు హర్షుఁడు జగత్ప్రియకారక మింక సిద్ధభూ
ధవుకథ సభ్యులో గుణము తత్పరతన్ గ్రహియింత్రు నాట్య మే
మవు? నది మా ధనంబు ఫల మందఁగ నొక్కటియైనఁ జాలుఁ బు
ణ్యావశము లెంచు నిన్నిసుగుణంబులు గూడిన వొక్కమాఱుగన్.

ఇఁక నింటికిఁ బోయి గృహిణిని బిలిచి సంగీతారంభ మొనరించెదను. (పరిక్రమించి నేపథ్యాభిముఖముగఁ జూచి) ఇదియే నాగృహ మిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి) ఏమే! ఇటు రమ్ము.

నటి—(ప్రవేశించి కన్నీటితో) మందభాగ్యురాల నిదిగో వచ్చితిని, ఏమిచేయవలయునో సెలవిండు.

సూత్ర—నాగానంద మాడఁబోవుచుండఁ గారణములేక యే దుఃఖించెద వేమే?

నటి—ఏడువ కెట్లుందును? మామగారు ముసలితనముచే నిర్విణ్ణులై వీరు కుటుంబభారము వహియింప సమర్థులైనారు గదా యని యత్తగారితోఁ గూడ నరణ్యమునకుఁ దప మాచరింపఁ బోయిరి.

సూత్ర—(విచారముతో) ఏమి! తల్లిదండ్రులు నన్ను విడిచి తపో వనమునకుఁ బోయిరా? ఇప్పు డేమి చేయవలయునో? (ఆలోచించి) గురుచరణపరిచర్యాసుఖము వదలి యింట నెట్లుండఁగలను?

గీ. అల్ల జీమూతవాహనునటు కులక్ర
మాగతైశ్వర్య మంతయు నవలఁ ద్రోచి
గురువరపదాబ్జపరిచర్య నెఱపుకొఱకుఁ
దరలెద నరణ్యమునకు సత్వరము నేఁడు.

(అని నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

# నాగానందము

## ప్రథమాంకము

(అంత నాయకుఁడు విదూషకుఁడు ప్రవేశింతురు)

నాయ—మిత్రుఁడా! ఆత్రేయ!

చ. ఎఱుఁగుదు రాగమూల మనియే నశియించును నిల్వఁబోవ దు
ర్వర సదసద్విచార మలరారఁగఁ దావొనరింప నేర దీ
సరణి వినింద్య మయ్యు గురుసన్నిధిలోఁ బరిచర్యయందుఁ దా
నరిగినచో వశం బగుచు యౌవన మీయది మోదహేతువే!

విదూ—(కోపముతో) వయస్య! ఇంతకాలమునుండియు నీ వీచచ్చియుఁ జావనివారినిఁ గొల్చుచు వనవాసదుఃఖ మనుభవించుచు నిజముగ విరక్తుఁడ వైతివి. ఇప్పుడేని యీ గురుచరణశుశ్రూషా నిర్బంధమును వదలి యిచ్ఛాభోగముల సమకూర్చు రాజ్యసుఖ మనుభవింప రమ్ము పోవుదము.

నాయ—నీ వీ విషయము బాగుగా నెఱుఁగవు సుమా!

సీ. గురుసన్నిధిస్థలిఁ గూర్చున్నచో నన్న
కోమరు కేసరిపీఠి నమరునొక్కొ?
అతనిపాదము లల్లనల్ల నొత్తఁగఁ గల్గు
తమి ధరాపాలమధ్యమున కేది?
అతఁడు తిని వీడినది తిన్న సంతృప్తి
యఖిలలోకాధిపత్యమునఁ గలదె?
అతఁడు నాయనా యని పిల్వఁ గలయుబ్బు
వందుల నుతిపాఠమం దలరునె?

గీ. తల్లిదండ్రులఁ ద్యజియించి తార్చుకొనిన
రాజ్య మాయాసమునకుఁ గారణముగాక
కలిగెడుగుణమ్ము మాత్రమ్ము కానరాదు
తుచ్ఛసౌఖ్యమ్ములకు నేమితుద? వయస్య!

విదూ—(తనలో) ఆహా! ఏమి! యీతనిగురుచరణశుశ్రూషాను రాగము. (ఆలోచించి) ఇట్లు చెప్పిచూచెదను. (ప్రకాశముగా) వయస్య! నేను కేవల రాజ్యసుఖము మాత్ర మూహించి వచి యింపలేదు సుమా! చేయవలసిన యితరకార్యములు గూడఁ గలవు.

నాయ—వయస్య? చేయవలసిన వీవఱ కే చేయఁబడినవి.

ఉ. అందఱు నీతిమార్గములయందుఁ జరింతురు, సాధుపాళికిన్
దొందర లేదు, బాంధవుల తోయము లాత్మసమంబు లయ్యె, రా
జ్యేందిర సుప్రతిష్ఠితను జేసితిఁ గోర్కికి హెచ్చు యాచకుఁ
లొందిరి కల్పమున్ మిగిలిపోయిన దేది వచింపు? మిత్రమా!

విదూ—నీప్రతిపక్షి యగు మతంగహతకుఁడు మిగుల సాహసికుఁడు. ప్రధానామాత్యుఁడు జాగరూకతతోఁ జూచుచున్నను మతం గుఁడు సమీపవర్తియై యుండ నీరాజ్యమునకు క్షేమ మని తలంపను సుమా!

నాయ—ఛీ! మూర్ఖుఁడ! మతంగుఁడు రాజ్యమును హరించునని యూ! భయపడుచుంటివి?

విదూ—అవును.

నాయ—అయిననేమి? నాశరీరము మొదలు సర్వమును బరార్థమునకే సంకల్పించుకొనియుంటిని. స్వయముగా నెందుల కీయరా దంటి వేని నాయనగారి యనురోధమువల్ల; ఈరాజ్యవస్తువునుగూర్చి

యాలోచించుటకంటెఁ దండ్రిగారియానతి నిర్వర్తించుటయే మేలు "తండ్రీ!జీమూతవాహన! బహుదినములనుండి వెచ్చించుచున్నందువలన నిచట సమిత్కుశపుష్పములు గాని నీవార ధాన్యములు గాని సంతృప్తిగ లభియించుటలేదు. మలయపర్వతమునకుఁ బోయి నివాసయోగ్య మగు నాశ్రమపద మొండు నిరూపింపు" మని వా రాజ్ఞాపించిరి. కావున మలయపర్వతమునకుఁ బోవుదము రమ్ము.

విదూ—నీచిత్తము.

(ఉభయులు నిష్క్రమింతురు)

విదూ—(ముందుఁజూచి) వయస్య! నిబిడతరచందనోత్సంగసాంగత్యమున గ్రహించిన పరిమళము నెల్లెడ వెదచల్లుచు నెగుడు దిగుడుగ నున్న స్థలముమీఁదుగ ఝర్ఝరనాదములతోఁ బ్రవహించు సెలయేళ్ళశీకరాసారములచేఁ జల్లనైన మలయవాయువు ప్రియవయస్యుని మార్గపరిశ్రాంతి నపనయించి ప్రథమసమాగమోత్కంఠిత యగుప్రియురాలి కౌఁగిలింతవలె రోమాంచము నొనగూర్చుచున్నది సుమా!

నాయ—ఆత్రేయ! అప్పుడే మలయపర్వతమునకే వచ్చితిమి. ఏమి యీ రామణీయకము!

సీ. మత్తహస్తికపోలభిత్తికాకషణా
రణభగ్నచందనస్రావ మగుచుఁ
దనమృహత్తర సుగంధాస్వాదసాగతే
ఫణిరాజమిథునసంపర్క మగుచుఁ
జలధివీచీభరాస్ఫాలనాక్రందిత
బహుగుహావిపులగహ్వరము నగుచు

సిద్ధాంగనాపాదసిక్తలాక్షారాగ
ముద్రితారుణశిలామోద మగుచు

గీ. మలయపర్వత మదియె కన్నులకు మిగులఁ
బండు వొనరించె నౌత్సుక్యభరితమయ్యె
మానసము వెంటనే యేగి మనకుఁ దగిన
యాశ్రమపదంబు వెదకుదమయ్య! మిత్ర!

విదూ—అట్లే! నడువుము.

(ఆరోహణము నటింతురు)

నాయ—(కుడికన్నదురుట సూచించి)

ఆ. వె. కోర్కి యెదియుఁ గోరుకొనలేదు కుడికన్ను
మిగుల నదరుచుండె మిత్రవర్య!
ఆర్షవచన మేటి కనృతమౌ నేశుభ
ఫలము నిద్ది తెలుపవచ్చె నొక్కొ?

విదూ—వయస్య! నీకుఁ గల్యాణ మాసన్నమైన దని తెల్పుచున్నది.

నాయ—నీమాట యేల కాదనవలెను!

విదూ—సఖా! ఇటు చూడుము. ఇది యొక తపోవనమువలెఁ గాన్పించుచున్నది. ఇతరత్ర నుండునట్లుకాక పాదపములు దట్టముగా బారులుతీర్చి యున్నవి. ఘ్రాణతర్పణముగ హావిర్గంధయుతమగు పొగ నల్దిక్కులఁ గ్రమ్ముచున్నది. భయములేక లేళ్ళు సాఖశాయనికము లైనవి.

నాయ—అవును నీవనిన ట్లది తపోవనమే!

చ. ఒలిచిరి చీరకై కరుణ యుంచి కొలందిగఁ జెట్లనార, ని
ర్మలమగు నేట విచ్యుతకమండలువుల్ కనుపించు బ్రహ్మచా

రులు తమ మౌంజి బంధములం ద్రోసి రిలన్ బురి త్రెస్సిపోవం జి
ల్కలు పఠియించుచున్నవి చిరశ్రవణంబున సామవేదముల్.

రా! లోపలికిం బోయి చూతము.

(ప్రవేశము నటింపుచు)

నాయ—(ఆశ్చర్యపడుచుం జూచి) సందిగ్ధవేదవాక్యార్థముల విమర్శించు మునిజనులతోడను, వేదపాఠముల వల్లించుచు సమిధల విఱుచు విద్యార్థులతోడను, వృక్షాలవాలముల నీరువోయు తాపసకుమారికలతోడను తపోవనము ప్రశాంత రమణీయముగా నున్నది. ఆహా!

చ. కలకలవల్కు స్వాగతమెగా యని తేంటులపాటపేర స
త్ఫలభరనమ్రశీర్షముల నంగి నమస్కృతి రీతిం జేయుం బూ
వుల వెదచల్లు నర్ఘ్యమను పోలికగా నిట నాకు భూరుహ
మ్ములు నివి సైత మెట్లతిథిపూజ నొనర్చుట నేర్చికొన్నవో!

ఈ తపోవనము నివాసయోగ్య మని తలంతును. ఇచట నివసించు మాకుం బరమానందము లభింపంగలదు.

విదూ—మిత్రమా! ఇటు చూడుము. మెడ కొంచెము ప్రక్కకుం ద్రిప్పి కదలికలేనినోటినుండి సగముకొఱికిన దర్భకవళము లీవలకు జాఱుచుండ నొక్క చెవి రిక్కించి సగము మూంతవడిన కన్నులతో నీ హరిణము లేదియో వినుచున్న ట్లున్నవి.

నాయ—(చెవియొగ్గి) అవు నవును.

ఉ. స్థానము నొంది మంద్రమును దారము నా గమకంబు చూపి తం
త్రీనినదంబుతో సరిగం దేంటులు పాడిన యట్లు పాడు వీ
ణానుతగీతి లేళ్ళు రదనమ్ముల నున్న తృణమ్ము మేయుచో
నానినదంబు మాని వలితాంగములై వినుచున్న వెమ్మెయిన్,

విదూ—ఈతపోవనమునఁ బాడుచున్న దెవరు?

నాయ—కోమలాంగుళితలముల మీఁటుచో నాతిస్ఫుటముగఁ దంత్రులు మ్రోఁగుచున్నందునఁ గాకలీప్రధానముగ వాద్యము జరుగుచున్నదని తలంతును. (చేతితోఁ జూపుచు) ఆ దేవాలయమున నెవ్వరో దివ్యాంగన దైవారాధనకొఱకు వీణ వాయించుచున్నదేమో!

విదూ—మనముఁగూడ దేవాలయములోనికిఁ బోవుదమా?

నాయ—మంచిమాటఁ జెప్పితివి. దేవతలు వంద్యులు. (సమీపించి హఠాత్తుగ నాఁగి) వయస్య! చూచుటకువీలుగాని స్త్రీజన మెవ్వరో యిందున్నారు. ఈ తమాలవనమధ్యమున డాఁగి దేవతాదర్శనావసరమును బ్రతీక్షింతము.

(అట్లే చేయుదురు)

(అంత భూమిమీఁదఁ గూర్చుండి వీణవాయిఁచుచు మలయవతి చేటి ప్రవేశింతురు)

నాయి—

గీ. విరియఁ బూచిన కమలకేసరపరాగ
గౌర మగు కాంతితో నలరారు గౌరి!
భగవతి! త్వదీయకారుణ్యభరముఁ జూపి
యీప్సితామోఘసిద్ధిఁ గావింపు మమ్ము.

నాయ—(గీతమును విని) వయస్య! ఏమిగాన మేమిమాధుర్యము!

సీ. దశవిధవ్యంజనధాతుమూలమ్ముగా
నతిమాత్రముగ లబ్ధ మయ్యె వ్యక్తి
ద్రుతమధ్యలంబితగతులలో మూఁడురూ
పమ్ముల లయ సువిస్పష్ట మయ్యె

సంపాదితములయ్యె సరసగోపుచ్ఛాగ్ర
ముఖములు క్రమముగా మూఁడుయతులు
వాద్యవిధములు తత్త్వౌఘానుగతనామ
శోభితమ్ములు మూఁడు చూపఁబడియె

గీ. నెంత విద్యావతియొకాని యీదృశమగు
గానకౌశలమును మున్ను గాంచి యెఱుఁగ
నహహా! యమృతసాగరముమధ్యమ్మునందు
నోలలాడించె నేనాఁటి యోగ మొక్కొ.

చేటి—(స్నేహముతో) భర్తృదారికా! చాలకాలమునుండి వాయించి తివి. నీ వ్రేళ్ళకీ పరిశ్రమ చాలును.

నాయి—(అధిక్షేపముతో) చతురికా! గౌరియెదుట వీణవాయించు నా వ్రేళ్ళకు నొప్పివెట్టుట యెట్టిదే?

చేటి—అమ్మా! నీకుఁ గోపముపచ్చినను సరియే కాని యింతకాలము నుండియుఁ గన్యాజన దుష్కరమ్ములగు నియమోపవాసము లచే నారాధించుచుంటివి; నీదయాహీనురాలియెదుట నెంత వాయించినను బ్రయోజనము లేదు సుమా!

విదూ—వయస్య! ఈమె కన్యకయే యఁట? మన మెందులకు జూడఁ గూడదు.

నాయ—దోషమేమి? కన్యకను జూచుటయందు దోష మేమియును లేదు. ఒకవేళ బాలభావసులభ మగు సిగ్గువొడమి పాఱిపో వచ్చును. ఈ తమాలాంతరమునుండియే చూచెదము గాక!

(అట్లే చేయుదురు)

విదూ—వయస్య! చూడు చూడు! ఆశ్చర్య మాశ్చర్యము. కేవల వీణా విజ్ఞానముచేఁ గర్ణపేయ మొనరించుటయే గాక వీణా విజ్ఞానానురూప మగు రూపముచే నయనానంద మొనర్ను

చున్నది. ఈమె దేవకన్యకయా! నాగబాలికయా! విద్యాధర దారికయా! లేక సిద్ధకుల సంభవయా!

నాయ—(ఆశతోఁ జూచుచు) ఎవ్వరో తెలియుటలేదు. ఇదిమాత్రే మెఱుంగుదును.

మ. సురకన్యామణియేని వాసవునిచక్షుల్ ధన్యముల్; నాగసుం
దరియే న్జంద్రవివర్జితంబగునె పాతాళంబు; మోనుండఁగన్
వరవిద్యాధరియేని జాతివితతి న్మాజాతియే లెస్సయా
ధరలో సిద్ధులెచూ ప్రసిద్ధులికఁ దద్వంశంబునన్ బుట్టినన్.

విదూ—(నాయకునిఁ జూచి హర్షముతోఁ దనలో) ఆహా! చిరకాలమున కీతఁడు మన్మథునివలలోఁ బడినాఁడు. (తన్నుద్దేశించుకొని భోజనమభినయించుచు) కాదుకాదు, బ్రాహ్మణుఁడనైన నా యొక్కనికే!

చేటి—(చనవుతో) భర్తృదారికా! కనికరములేని యీమె యెదుట వాయించినఁ బ్రయోజనము లేదమ్మా!

నాయి—ఓసీ! గౌరీదేవిని నిందింపకుము. ఆమె యిప్పుడే నాకుఁ బ్రసాదించినది.

చేటి—(సంతోషముతో) అమ్మా! అది యెట్టిదో తెల్పఁగూడదా?

నాయి—చేటీ! ఇప్పుడు వీణవాయించుచుండఁగనే కలలోఁ గన్పడి గౌరీదేవి నాతో నిట్లు పల్కినది. “వత్సా! నీవీణావిజ్ఞానాతిశయమునకు, అసలాజనదుర్లభ మగు భక్తికిని మెచ్చితిని. అచిరకాలముననే విద్యాధరచక్రవర్తి నీపాణిగ్రహణ మొనర్చును”

చేటి—(సంతోషముతో) అట్లయినఁ గల యనియెద వెందులకు? మనసునఁగల కోరికనే గౌరీదేవి ప్రసాదించినది.

విదూ—ఇది భగవతీదర్శనావసరము. రమ్మా! సమీపింతము.

నాయ—నేనుమాత్రము రాను.

విదూ——(ఇష్టములేకున్నను నాయకుని బలవంతముగా నాకర్షించును. ఇర్వురును దేవాలయమునఁ బ్రవేశింతురు)

విదూ——అమ్మా! నీకు స్వస్తి యగుఁగాక! గౌరీదేవి నీకు నిజముగ వరప్రసాద మొనర్చినది.

నాయి——(హఠాత్తుగ లేచి నాయకునిగుఱించి, అపవారించి) చేటీ! వీరెవరే?

చేటి——(నాయకునిఁ జూపి, అపవారించి) వీని యనన్యాదృశాకారము చేత గౌరీదేవి ప్రసాదించిన వరుఁడేమోయని భావించుచున్నాను.

నాయి — (కాంక్షతోను లజ్జతోడను నాయకునిఁ జూచుచుండును.)

నాయ——

చ. తరళతరాయతాక్షి! శ్వసితప్రచలద్ఘనపీవర స్తనీ!
వరజఘనోరుకాండ! బలవంతముగా నిటు లేవఁబోయి త
త్తఱపడఁబోకు మీవలసె తావకదేహ మహో నలంగె ను
ద్ధురనియమవ్రతంబుల నితోధికఖిన్న మొనర్పఁబోకుమా!

నాయి——(అపవారించి) ఈతని యెదుట నిలువలేకపోవుచున్నానే! (నాయకు నోరచూపులతోఁ జూచుచు ముఖము ప్రక్కకుఁ ద్రిప్పికొని యుండును.)

చేటి——భర్తృదారికా! ఇదియేమి?

నాయి——ఈతని సమీపమున నుండుటయే కష్టమనిపించుచున్నదే. ఇంకొకచోటికిఁ బోవుదము రమ్మా.

(అని లేవఁబోవును)

విదూ——వయస్య! ఈమె భయపడుచున్నది. నేను బూర్వము చదివిన చదువువలనే యొక్కింతసేపు నిలువఁబెట్టెదను. అమ్మా! మీ తపోవనమునకు వచ్చిన యతిథులను వాక్కుచేనైన సంభావింపకుండుట యాచారమా?

చేటి—(తనలో) ఈమెదృష్టి యనురక్తమైన ట్లున్నది. ఇట్లు చెప్పి చూచెదను. (ప్రకాశముగా) భర్తృదారికా! బ్రాహ్మణుఁడు నిజము పల్కుచున్నాఁడు. అతిథిజనసత్కారము నీవు చేయ వలసిన పని; ఈమహానుభావుఁ డెదుట నుండఁగఁ బ్రతిపత్తి మూఢ వైతి వేమి? పోనీ, నేనే చేయవలసినపని జేయుదును. (నాయకును ద్దేశించి) మహాత్మా! స్వాగతము! ఈప్రదేశమున నాసనము పరిగ్రహింపుము.

విదూ—చతురిక లెస్సగాఁబల్కినది. క్షణకాల మిచట విశ్రమింతము.

నాయ—మంచిది.

(అని కూర్చుండెదరు)

నాయి—(చేటికను జూచి) ఓసీ! పరిహాసశీలురాలా! ఇది యేమి పనియే? ఏతాపసియైనఁ జూచినచో న న్నవినీతురా లని తలంపఁగలఁడు.

తాప—(ప్రవేశము నటించి) కులపతి యగు కౌశికుఁడు. "వత్సా! శాండిల్యా! తండ్రియానతిచే సిద్ధయువరా జగు మిత్రావసువు భవిష్యద్విద్యాధరచక్రవర్తి యగు కుమారజీమూతవాహను నకు మలయవతి నొసంగు నుద్దేశముతో నీమలయపర్వతమునఁ దిరుగునాతని వెదుకఁ బోయినాఁడు. ఆతని రాకకై వేచియున్న మలయవతికి మధ్యందినసవనవేళ యతిక్రమించిన నతిక్రమింప వచ్చును. కావున నామెను బిలుచుకొనిర"మ్మని యాజ్ఞాపించి నాఁడు. గౌరీగృహమునకుఁ బోయి మలయవతినిఁ బిలిచికొని పోయెదను. (పరిక్రమించుచు భూమిపైఁ జూచి నిర్విణ్ణుఁడై) ఈపాంసులప్రదేశమున విస్పష్టచక్రాంకితమైన పదపంక్తి యెవ్వ రిదో! (ముందు జీమూతవాహనునిఁ జూచి) ఈపదముద్ర లీతనివే.

మ॥ తల నుష్ణీషము నూర్ణముఁ బొమలమధ్యన్ వెల్గెడిన్ లోచనం
బులు పద్మమ్ములు బోల్చుఁ గేసరియురమ్మున్ గేరు జక్రాంకిత

మ్ములు పాదంబు లితం దెవం డయిన రేపో మాపో విద్యాధరో జ్జ్వల రాజ్యాధిపతిత్వగౌరవము సంస్థాపించు నం చెంచెదన్.
సందేహ మెందులకు? ఈతఁడే జీమూతవాహనుఁడు. (మలయవతినిఁ జూచి) రాజపుత్రి యగు మలయవతిఁ గూడ నిచ్చటనే యున్నదే! (ఇర్వురఁ బరికించి) అన్యోన్యానురూప మగు దాంపత్యము ఘటించు నేని విధి చిరకాలమునకు యుక్తకార్య మొనర్చినవాఁ డగును. (సమీపించి నాయకు నుద్దేశించి) నీకు శుభ మగుఁగాక!

నాయ—భగవానుఁడా! జీమూతవాహనుఁడు నమస్కరించుచున్నాఁడు. (అని లేవఁబోవును)

తాప—వలదు, వలదు. "సర్వస్యాభ్యాగతో గురు" వను న్యాయము చేత నీవే మాకుఁ బూజనీయుఁడ వట్లే కూర్చుండుము.

నాయి—ఆర్యా! నమస్కరించుచున్నాను.

తాప—(నాయికను జూచి) అమ్మాయి! అనురూపుఁ డగు భర్తను వరింపుము. మధ్యందినసవన వేళ యతిక్రమింపకుండ రమ్మని కులపతి యగు కౌశికుఁ డాజ్ఞాపించుచున్నాఁడు.

నాయి—చిత్తము. (అని లేచి నిశ్వసించి తనలో)

క. గురువచన మొక్కవంకను
వరదర్శనసౌఖ్య మొక్కవంకను బరఁగన్
దరలుటో! మానటో! తెలియక
యిరుకునఁ బడిపోయె హృదయ మిప్పు డిదేమో!

(సలజ్జముగ సానురాగముగ నాయకునిఁ దిరిగిచూచుచుఁ దాపసితో నిష్క్రమించును)

నాయ—(సోత్కంఠముగా నిశ్వసించి నాయికను జూచుచు)

గీ. మొనయు జఘనభారమునఁ జేసి మెలమెల్ల
నవలకు నను వీడి యరుగుచుండె

నైనఁ గాని నాహృదంతరమ్మున నీమొ
కాలువెట్టి యిపుడు కదలకుండె.

విదూ—చూడవలసినది చూచితిమి. వినవలసినది వింటిమి. మధ్యాహ్న సూర్యాతపము రెట్టించినట్లు నాజఠరాగ్ని కనకనలాడుచున్నది. అతిథినగుటచే మునిజను లొసఁగు కందమూలఫలాదులచేతనే కడుపు నింపుకొని యీబ్రాహ్మణప్రాణములను నిలువఁబెట్టుకొందును.

నాయ—ఓయీ! భగవంతుఁడగు సహస్రదీధితి నభస్థలమధ్య మధ్యాసించుచున్నాఁడు.

ఉ. తాపము సైఁపలే కపుడె త్రచ్చిన గంధరసమ్ము పూయ గం
డోపరియెల్లఁ దెల్లవడె నొయ్యన మోమున వీను వీవనల్
జోఁపుచునుండెఁ దుండమునఁ జొన్పిన నీటిని జల్కు ఱొమ్ముపైఁ
బ్రాపితమయ్యె సల్లకివిపాక మనేకపరాజు మేనికిన్.

(అని నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

# నాగానందము

## ద్వితీయాంకము

### ప్రవేశకము

(అంతటఁ జేటి ప్రవేశించును)

చేటి—భర్తృదారిక యగుమలయవతి "ఓసీ మనోహరికా! నాయన్న గారు మిత్రావసు వింకను రాలేదు. త్వరితముగ నేగి వచ్చెనో లేదో తెలిసికొని ర" మ్మని యాజ్ఞాపించినది. ఆమెయానతి నిర్వర్తించెదను. (నేపథ్యాభిముఖముగఁ జూచి) అతిత్వరితముగ వచ్చుచున్న దీమె యెవ్వరో? (నిరూపించి) ఓహో! చతురిక?

(అంత రెండవచేటి ప్రవేశించును)

ప్రథ—(సమీపించి) ఏమే! ఎదుటనున్న నన్నుఁగూడ చూడకుండఁ బరు వెత్తుచుంటి వెచ్చటికే!

ద్వితీ—మనోహరికా! రాజపుత్రి "చతురికా! పుష్పాపచయమున నాశరీరము మిక్కిలి యలసిపోయినది శరదాతపమునఁ బుట్టిన శరీరతాప మధికమగుచున్నది. వెంటనే యేగి బాలకదళీదళపరిక్షిప్తమగు చందనలతాగృహంబునఁ జంద్రకాంతశిలాతలంబును బాగు చేయు" మని యాజ్ఞాపించినది. ఆమెయాజ్ఞ నిర్వర్తించితినిఁ గావున వెంటనే యేగి చెప్పవలసియున్నది.

ప్రథ—వెంటనే పోయి చెప్పుము. అచట విశ్రమించినచో సంతాపముపశమింపవచ్చును.

ద్వితీ—ఆమెసంతాప మిట్లుపశమించునది కాదు. అతివిచిత్ర మగు చందనలతాగృహమును జూచినచో నది మఱియింతవృద్ధి కాఁగలదు. మణిశిలాఫలకము సిద్ధపఱిచితి నని పోయి విన్నవింతును.

(అని యిర్వురును నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

(అంతట సోత్కంఠ యగు మలయవతి చేటి ప్రవేశింతురు)

నాయి—(నిశ్వసించి తనలో) ఓసీ! హృదయమా! అప్పు డాతని ముందు లజ్జచే నను బరాఙ్ముఖిని గావించి యిపుడు నీ యంతట నీవే యచటికిఁ బోవుచుంటివా? ఏమే! నీ యాత్మంభరిత్వము? (ప్రకాశముగా) చతురికా! గౌరీదేవియాలయమునకు దారిఁ జూపుము.

చేటి—చందనలతాగృహమునకుఁ గాదా భర్తృదారిక బయలుదేఱినది?

నాయి—(సిగ్గుతో) బాగుగా జ్ఞాపకము చేసితివి, అచటికే పోవుదము రమ్ము.

చేటి—అమ్మా! ఇటు.

(అని చందనలతాగృహమువైపు దారిదీయును)

నాయి—(ఇంకొకవైపునకుఁ బోవును)

చేటి—(వెనుకకుఁ జూచి తంద్రాభయములతోఁ దనలో) ఔరా! ఏమి యీమె శూన్యహృదయత్వము. మరల నాదేవీగృహమునకే బయలుదేఱినది. (ప్రకాశముగా) అమ్మా! చందనలతాగృహ మటు లేదు, ఇటు.

నాయి—(నవ్వుచు ననుగమించును)

చేటి—ఇదియే చందనలతాగృహము. చంద్రకాంతశిలాఫలకమున నాసీనురాలవై సేదఁ దీర్చికొనుము. (ఇరువురుఁ గూర్చుందురు)

నాయి—(నిశ్వసించుచుఁ దనలో) భగవంతుఁడా! కుసుమాయుధ! ఎవని సౌందర్యముచే నీవు నిర్జితుఁడవైతివో వానిపై నీదర్పము జూపింపక నిరపరాధ నబల నగు నాపైఁ జూపుటకు సిగ్గుపడుటలేదా? (ప్రకాశముగా) చెలీ! ఏహేతువుననో కాని సూర్యకిరణములు దట్టములైన చివుళ్ళతో నరికట్టఁబడినను

చందనలతాగృహ మిప్పటికిని నాసంతాపదుఃఖమును బోఁగొట్టుటయే లేదు.

చేటి—(నవ్వుచు) నీసంతాపమునకుఁ గారణము నే నెఱుంగుదును. నీవు మాత్రము దాని నొప్పుకొనవు.

నాయి—(తనలో) ఏమి! ఈమె నారహస్యమును గుర్తించినదా! అయిన నిట్లడిగి చూచెదను. (ప్రకాశముగా) ఏమే నే నొప్పుకొనని దేమున్నదే? నీవ ట్లూహించుటకుఁ గల కారణము దెల్పెదవా!

చేటి—ఈ నీ హృదయస్థితవరుఁడే!

నాయి—(సంభ్రమముతో రెండుమూఁ డడుగులు వైచి) ఆతఁ డెచ్చట?

చేటి—(నవ్వుచు) ఆతఁ డెవ్వఁడు?

నాయి—(సిగ్గుతోఁ దల వంచుకొని కూర్చుండును)

చేటి—నేను చెప్పునది పూర్తిగా వినవమ్మా! దేవి నీకు స్వప్నమునం దనుగ్రహించిన వరుఁ డుత్తరక్షణమునందే కుసుమబాణములఁ ద్యజించిన మన్మథునివలె నీయెదుట నవతరింపఁ జూచితివి. ఆతఁడే నీసంతాపమునకుఁ గారకుఁడు. స్వభావశీతలమగు చందనలతాగృహమును దత్సంతాపము నపనయింపఁజాలదు సుమా?

నాయి—ఓసీ! నీవు చతురికవే కదా! నీయెదుట దాఁపవలసిన దేదియును లేదు. అంతయుఁ దెల్పెదను.

చేటి—అమ్మా! ఇప్పుడే కదా చెప్పితివి. అతివిస్తర మెందులకు? త్వరపడకుము. ఈసంతాపమును నిరోధింపుము. నేను చతురికనంటినికదా! నిన్నుఁ జూచిననేతప్పు నాతఁడును వినోదింపఁజాలఁడని నేను కనిపెట్టితిని.

నాయి—(కన్నీటితో) సఖీ! నాకంతటి భాగ్యము కలుగునా?

చేటి—అమ్మా! మధుసూదనునకు వక్షస్స్థలమున లక్ష్మి లేనిదే సంతోష మెచ్చటిది?

నాయి—బాంధవులు ప్రియవాక్యములు దప్ప నితర మెట్లు వచింప నేర్తురు? అనుహానుభావుని వాజ్మాత్రము చేనైన సంభావింప నేరనందులకు నన్నదక్షిణురా లనుకొనునేమో యని నాకు విచారముగా నున్నది సుమా! (అని యేడ్చును)

చేటి—విచారింపకుము. (తనలో) పాప మేడువ కెట్లుండును? ఈమెను హృదయసంతాప మధికముగా వేధించుచున్నది. ఇప్పు డేమి చేయుదును. చందనపల్లవరస మీమె హృదయమునకుఁ బూయుదును. (ప్రకాశముగా) ఏడువకుము. స్తనములకుఁ బూసిన చందనరస మవిరళధారగా నేడ్చుచున్నచోఁ గన్నీటఁ దోఁగి మఱింత వేఁడి కలిగించును.

(అరఁటియాకుతో వీచును)

నాయి—సఖీ! విసరకుము. కదలీదళవాయువుగూడ నుష్ణముగా నున్నది.

చేటి—అమ్మా! దీనిపై దోష ముంపకుము.

క. అవిరళనవచందనప
ల్లవసంసర్గాతిశీతలం బిది యైనన్
భవదీయోష్ణశ్వసితము
లవులుట నీమాఁకుటెంబు తాపముఁ గూర్చున్.

నాయి—సఖీ! ఈసంతాపము పోవు నుపాయ మేదియును లేదా?

చేటి—ఉన్నది. ఆతఁ డిటకు దయసేయుట యే!

(అంత నాయకుఁడు విదూషకుఁడును బ్రవేశింతురు)

నాయ—

ఉ. నను విడనాడి యేగుచు నెనాతి సితాసితవీక్షణంబులన్
దనిపిన చెట్లశాఖ లజినంబులు గట్టినయట్టు లుండ నో

య్యనఁ దలఁద్రిప్పి యమ్మునిసమక్షమునన్ బ్రహరించెఁ జూచుచున్
మనసిజ! పూవుటమ్ములను మాత్రము వమ్మొనరింపఁబోకుమా!

విదూ—వయస్య! నీధైర్యమంతయు నెచ్చటకుఁ బోయినది?

నాయ—

సీ. శశికాంతిధవళితోజ్జ్వలరాత్రులన్నియు
నీతంబులేకద నేఁటిదాఁక
విడనాడినాఁడ నే వికసితేందీవర
సుమమును వాసనఁ జూడకుండ
సుందరమాలతీసురభితుండయి వీఁగు
సంధ్యాప్రభంజను సైఁప లేదొ?
చెవియొగ్గలేదె? కుశేశయాకరమందుఁ
గలితద్విరేఫఝుంకారములకుఁ

గీ. గష్టకాల మెట్లొ గడపుచునేయుంటి
హేతువేమిలేకయే వయస్య!
ఆపదలు ఘటించునట్టి వేళలలో న
ధీరుఁ డనుచు నన్నుఁ దెగడనగునె?

నిజముగా నధీరుఁడనే!

గీ. ఆఁడుదానిరీతి ననమాయుధుం డేయు
శరపరంపరలను సైఁప లేక
నిరత మెదుటనున్న నీతోడ నే ధైర్య
వంతుఁడ నని యెట్లు పలుకువాఁడ?

విదూ—(తనలో) మిక్కిలి యధైర్యమును జెంది యీతఁడు తనహృదయావేగమును వెల్లడించుకొనుచున్నాఁడు. ఎటులేని దీనినుండి మరలించెదను (ప్రకాశముగా) వయస్య! గురుజన శుశ్రూష నింత త్వరలో ముగించుకొనివచ్చితి వేల?

నాయ—మిత్రమా! ఈప్రశ్న నీ వడుగవలసినదే నా కాత్మీయు లెవరున్నారు! (చేటితోఁ జూపుచు) నాప్రియురా లీ చందనలతాగృహమ్మునఁ జంద్రకాంతశిలాఫలకమునం దాసీనురాలై ప్రణయకోపముతో నన్ను నిందించుటకో యనున ట్లేడ్చుచుండఁగ స్వప్నము గాంచితిని. స్వప్నానుభూతదయితాసమాగమముకల యాప్రదేశముననే దివసావశేషమును గడప నిశ్చయించితిని రమ్ము పోవుదము.

విదూ—రా రమ్ము. (అని పరిక్రమింతురు.)

చేటి—(చెవియొగ్గి సంభ్రమముతో) అమ్మా! అడుగులచప్పుడువలె వినిపించుచున్నది.

నాయి—(సంభ్రమముగాఁ దన్నుఁ జూచికొనుచు) ఈదృశమగు నా యాకారమును గాంచి నాహృదయ మెవ్వరేనియు గుర్తింపఁగలరు. కావున నీరక్తాశోకపల్లవాంతరమున డాఁగి యెవరు వచ్చుచున్నారో చూతము. (అట్లే చేయుదురు)

విదూ—ఇదియే చందనలతాగృహము, లోపలఁ బ్రవేశింతమా!

నాయ—(చూచి)

గీ. చంద్రకాంతశిలావేదిఁ జంద్రవదన
కానుపించనికతమునఁ గన్నుఁగవకుఁ
జందనలతాగృహం బిది చంద్రకాంతి
తొలఁగిపోయిన నిశరీతి దోఁచుచుండె.

చేటి—(విని) భర్తృదారికా! నీయదృష్టముపండినది ఆతఁడు నీహృదయవల్లభుఁడే.

నాయి—(హర్షసాధ్వసములతోఁ జూచి) అతిసాధ్వసమువలన నీతని యెదుట నిలువ లేకున్నాను. వీనికంటఁ బడకుండ నింకొకచోటికిఁ బోవుదము రమ్ము. (తొట్రుపడుచు నడచి) నా పాదము లేల వదరుచున్నవేమి?

చేటి—(నవ్వి) ఓసీ! కాతరురాలా! ఇచటనున్న నిన్నెవ్వరు చూతురే? నీయెదుట రక్తాశోకపాదపమున్న మాటయే మఱచితివా?

విదూ—ఇదియేనా చంద్రకాంతశిలావేది?

నాయ—(కన్నీటితో నిశ్వసించును)

చేటి—అమ్మా! మాటలుగూడ విన్పించుచున్నవి శ్రద్ధగా వినవలయును.

విదూ—(చేతితోఁ గదపుచు) చంద్రకాంతశిల యిదియేనా యని యడుగుచున్నానయ్యా!

నాయ—మిత్రమా! నీవు బాగుగా గుర్తించితివి (వ్రేలితోఁ జూపుచు)

ఉ. కోపము డాఁచియున్ బయికిఁ గొంచెముగా స్ఫురితాధరంబులన్
జూపుచు నిశ్వసించుచును సుందరి జాగొనరించినాఁడ సం
చాపయి వామహస్తమున నయ్యయొ పాండురమైనయాస్యమున్
మోపి యొకింతగా నడలిపోవుట చూచితి నీ శిలాస్థలిన్.

కావున ఈచంద్రకాంతశిలావేదిపైఁ గూర్చుందము రమ్ము.

(అని కూర్చుందురు)

నాయి—(యోజించి) ఆమె యెవ్వరయి యుండునే?

చేటి—అపవారితులమై మన మాతనిఁ జూచుచున్నట్లే నిన్నుఁగూడ నాతఁడు చూచుటలేదు కదా?

నాయి—అది సరియే! ఈతఁడింతగాఁ డలపోయుచున్న ప్రణయకుపితురాలగు ప్రేయసి యెవ్వరో?

చేటి—ఏమియుఁ బ్రశ్నింపక వారిసంభాషణము విను.

విదూ—(తనలో) ఇది చాల మనోహరముగా నున్నది. అగుఁగాక! ఇట్లడిగి చూచెదను. (ప్రకాశముగా) వయస్య! ఏడ్చుచుండఁ జూచి యూరకుంటివా లేక యోదార్పఁ బ్రయత్నించితివా?

నాయ—వయస్య! ఈమాటమాత్ర మంటిని.

గీ. తావకాశ్రుకణమ్ములఁ దడిసిపోయి
యబల! నీ ముఖచంద్రోదయమ్మువలనఁ
జంద్రకాంతశిలావేది సరగునను ద్ర
వించిన దటంచు నేను యోజించుచుంటి.

నాయి—(కోపముతో) చతురికా! ఇంకను వినవలసిన దేమున్నదే?
(కన్నీటితో) రా! ఇంకొకచోటికిఁ బోవుదము రా!

చేటి—(చేయిపట్టుకొని) వలదు, వలదు. నిన్నుఁ జూచిన తరువాత
నింకొకమాట చెప్పునని నేను నమ్మఁజాలను. కథావసానమును
బ్రతిపాలింతము.

నాయ—వయస్య! ఈశిలాఫలకమున నామెరూపు చిత్రించి యాచిత్ర
ముతోఁ గొంతసేపు వినోదించెదను. కొండచఱియల నున్న
మనశ్శిలాశకలముల నేటి తెచ్చెదవా?

విదూ—నీయిష్టము (అని యేగివచ్చి) నీ వొక్క రంగుమాత్రమే చెప్పి
తివి. సులభములగుటచే నే నైదురంగులవి తెచ్చినాను. ఇవిగో!

నాయ—మంచిపనిఁ జేసితివి. (శిలయందుఁ జిత్రించుచు) గగుర్పాటుతో
వయస్య! చూడు చూడు,

గీ. పరిణతారుణబింబసావర్ణ్య మొలయు
నధరముల నయనోత్సవ మాచరించు
ప్రేయసీముఖరేఖ యూహించుచుండె
నా ప్రథమదృష్టి. శశిరేఖనా, వయస్య!

(అని వ్రాయును)

విదూ—(సంతోషముతోఁ జూచి) ప్రియురాలు పరోక్షముగా నున్నను
జిత్రించుచుంటి వెంత యాశ్చర్యము!

నాయ—ఆశ్చర్య మేమున్నది?

గీ. ఎదురుగా లేకపోవుటయేమి? యిచటఁ
గలదు సంకల్పబలమునఁ గట్టికొంటి
వ్రాయుచుంటివి ప్రియురాలివైపు మాటి
మాటికినిఁ జూచి యబ్బురపాటు వలదు.

నాయి—చతురికా! కథావసానము తెలియనే తెలిసినది, రమ్ము. మిత్రావసుని దర్శింతము.

చేటి—(సవిషాదముగఁ దనలో) ఈమెయాలాపములు జీవితనిరపేక్ష సూచించుచున్నవి. (ప్రకాశముగా) అమ్మా! మనోహరిక వెళ్ళనే వెళ్ళినది. మిత్రావసు విచటికే రాఁగలఁడు.

(అంత మిత్రావసువు ప్రవేశించును)

మిత్రా—తండ్రిగారు "వత్సా! మిత్రావసు! కుమారజీమూతవాహనుఁ డిచటకే తెంచినప్పుడు పరీక్షించితిమి. యోగ్యుఁడగువరుఁడు కావున మలయవతి నాతనికిఁ బ్రతిపాదింపు" మని యాజ్ఞాపించినారు. స్నేహపరాధీనుఁడ నగుటచే వేఱొక యవస్థకుఁ బాల్పడుచున్నాను.

మ. అలవిద్యాధరభావిచక్రపతి విద్యాంభోధి ప్రాజ్ఞుండు ని
స్తులరూపమ్ము పరాక్రమంబును వయస్సున్ గల్గుసౌమ్యుండు ని
చ్చలు సత్వార్థము ప్రాణమీఁగఁడఁగు మాసర్వస్వ మివ్వాని చే
తుల కర్పింప మనస్సు మోదమునుజెందున్ దుఃఖమున్ గ్రాడెన్.

ఈగౌర్యాశ్రమనికటస్థ మగు చందనలతాగృహమ్మున జీమూతవాహనుఁ డున్నాఁ డని వింటిని, పోయి చూచెదను.

(అని ప్రవేశించును)

విదూ—(తత్తరపాటుతోఁ జూచి) వయస్య! కదళీదళములతోఁ జిత్రగతకన్యారత్నము నాచ్ఛాదింపుము. సిద్ధయువరాజగు మిత్రావసువు వచ్చుచున్నాఁడు. అతఁ డది చూడఁగూడదు.

నాయ—(అట్లే చేయును)

మిత్రా—(ప్రవేశించి) మిత్రావసువు నమస్కరించుచున్నాఁడు.

నాయ—స్వాగతము. ఇచటఁ గూర్చుండుము.

చేటి—అమ్మా! నీయన్నగారు వచ్చినారు.

నాయి—మంచిది.

నాయ—కుమారా! సిద్ధరాజగు విశ్వావసునకుఁ గుశలమేనా!

మిత్రా—తండ్రిగారికిఁ గుశలమే. వారియాజ్ఞానుసారమే నినుఁ జూడ వచ్చితిని.

నాయ—వారేమి సెలవిచ్చిరి.

నాయి—తండ్రిగారిసందేశమును జాగ్రత్తగ వినవలయును.

మిత్రా—"మాకు సిద్ధరాజాన్వయసర్వస్వమును జీవితమును నగు మలయవతి యను కూఁతురు గలదు. ఆమెను నీకొసఁగఁదలఁచితిని గావునఁ బరిగ్రహింపు" మని తండ్రిగారి యాజ్ఞ.

చేటి—అమ్మా! ఇప్పుడు కోపగింపవేమి?

నాయి—(సంతోషముతో నధోముఖియై) నవ్వకే! ఈతని యన్యహృదయత్వమును మఱచిపోయితివా?

నాయ—(అపవారించి) ఇప్పుడు గొప్పచిక్కులోఁ బడితిని.

విదూ—వయస్య! ప్రియురాలిని విడిచి నీ వింకొకదాని బ్రేమించవని యెఱుంగుదును. ఏదియే నొక సమాధాన మొసఁగి యీతని సాగనంపుము.

నాయి—(కోపముతో) హతాశుఁడా! ఈమాత్ర మెవ్వ రెఱుఁగరు?

నాయ—మిత్రావసు! అత్యంతశ్లాఘ్య మగు మీతోడిసంబంధ మెవ్వ రిచ్చగింపరు? నాహృదయ మింకొకచో లగ్నమైనందున మీవైపుఁ ద్రిప్పఁజాలకున్నాను. కావున మీచెలియలిఁ బరిగ్రహింపఁ జాలను.

నాయి—(మూర్ఛ నటించును)

చేటి—అమ్మా! ఊఱడిల్లుము. ఊఱడిల్లుము.

విదూ—అయ్యా! ఈతఁడు పరాధీనుఁడు. కావున బలవంత పెట్టి ప్రయోజనములేదు. ఈతనితలిదండ్రుల నభ్యర్థింపుఁడు.

మిత్రా—(తనలో) ఈబ్రాహ్మణుఁడు మంచిమాట చెప్పినాఁడు. గురుజనవాక్యము నీ జీమూతవాహనుఁడు తిరస్కరింపఁ జాలఁడు. వీనితలిదండ్రులు నీగౌర్యాశ్రమముననే నివసించుచున్నారు. వారికే మలయవతినిగూర్చి నివేదించెదను.

నాయి—(మూర్ఛ దేఱును)

మిత్రా—మే మిట్లభ్యర్థించుచుండ మమ్మ్ముఁ దిరస్కరించుట కుమారునకే తెలియును.

నాయి—(కోపముతో నవ్వి) తిరస్కారావమానితుఁడై మరల మిత్రావసు వేదియో యనుచున్నాఁడు.

(మిత్రావసువు నిష్క్రమించును)

నాయి—(కన్నీటితోఁ దనలో) దౌర్భాగ్యకలుషితము నత్యంతదుఃఖమగ్నము నగునీశరీర మిప్పు డుండిమాత్ర మేమిప్రయోజనము. అశోకపాదపమున కంటియున్న యతిముక్తలతను గంఠమున నురిపోసికొందును. (ప్రకాశముగా) నేనుఁగూడ నిచటినుండి పోఁదలఁచుకొంటిని. సఖీ! మిత్రావసువు దూరమేగినాఁడో లేదో చూచిరమ్మ.

చేటి—(కొన్నియడుగులువైచిచూచి తనలో) అన్యాదృశమగు నీమె హృదయమును జూచుచుండ నింకొకర్తె యడు గావలకుఁ బెట్టుటకు నా మన స్సొప్పుకొనుటలేదు. ఇచటనే డాఁగియుండి యేమిచేయుచున్నదో చూచెదను.

నాయి—(చుట్టును జూచి పాశమును గ్రహించి) అమ్మా! గౌరి! ఈజన్మమున నన్ననుగ్రహింపకపోయినను పైజన్మమునందేని నిట్టి దుఃఖ మనుభవింపకుండఁ గాపాడుము.

చేటి—(సంభ్రమముగా సమీపించి) రక్షింపుఁడు! రక్షింపుఁడు. మారాజపుత్రి, ఉరిపోసికొని చచ్చుచున్నది.

నాయ—(త్వరగ వచ్చి) ఏది! ఆమె యెచ్చట నున్నది?

చేటి—ఈయశోకవృక్షమున.

నాయ—(సంతోషముతో) ఈమె నా మనోరథభూమియే. (నాయికను జేతులతోఁ బట్టుకొని పాశమును దీసివైచి)

చ. వలవదు ముగ్ధ! సాహసము పాణులతోడ బిగింపఁబోకు మీ
లలి నతిముక్తపాశము తలంచెద నీకరపల్లవంబు పూ
వులఁ దునుమంగనైన సరిపోవని దంచు ని దెట్లు పాశమున్
గొలుపఁగ నేర్చెనో వలదు కోమలి! యీదృశపాపకార్యముల్.

నాయి—(భయముతో) ఓసీ! ఈతఁ డెవ్వఁడు? విడువుము. నాకర పల్లవంబుల విడువుము. నన్ను నివారించుటకు నీ వెవ్వఁడవు? చచ్చుటకుఁగూడ నిన్నుఁ బ్రార్థింపవలయునా?

నాయ—ఓసీ! ముద్దరాల!

క. లలితమగు హారమలరఁగ
వలసిన గళమందుఁ గేలు పాశం బిడుటన్
సలిపిన దపరాధం బస
బలిమిని గ్రహియించినాఁడ విడలుట యెట్లుల్.

విదూ—(చేటినిసమీపించి) ఈమెమరణప్రయత్నమునకుఁ గారణ మేమి?

చేటి—ఈ నీప్రియస్నేహితుఁడే!

నాయ—ఏమీ! నేనే కారకుఁడనా? నాకేమియు బోధపడుట లేదు.

విదూ—చేటీ! ఈతఁ డెట్లు కారకుఁడైనాఁడు?

చేటి——(అభిప్రాయగర్భితముగా) చంద్రకాంతశిలాతలమ్మునఁ జిత్రించిన సుందరియందలి పక్షపాతముచే నీప్రియవయస్యుఁడు మిత్రావసువు ప్రతిపాదించినను దన్ను బరిగ్రహించినాఁడు కాఁడని, నిర్వేదముతో నీసాహసమునకు దిగినది.

నాయ——(సంతోషముతోఁ దనలో) ఈమెయే విశ్వావసుపుత్రియగు మలయవతియా? రత్నాకరమ్మునఁగాక చంద్రరేఖ జనించునా?

విదూ——నాప్రియవయస్యుఁ డపరాధి కాఁడు. ఈమెయే శిలాతలమ్మునఁ జిత్రింపఁబడినది. నీవు నమ్మవేని స్వయముగాఁ బోయి చూడవచ్చును.

నాయి——(సంతోషముతో సిగ్గుతో నాయకునిఁ జూచుచుఁ జేయి విడిపించుకొనును)

నాయ——(నవ్వుచు) శిలాతలమునఁ జిత్రించిన నాప్రియురాలినిఁ జూడ నిదే చేయి వదలను.

(అందఱును జందనలతాగృహమ్మునఁ బ్రవేశింతురు)

విదూ——(అరఁటియాకు దీసివైచి) ఈమూర్తిని హృదయవల్లభ నాలోకింపుఁడు.

నాయి——(నిరూపించి నవ్వుచు) చేటీ! నన్నే వ్రాసినట్లున్నదే!

చేటి——(చిత్రాకృతిని నాయికను జూచి) నన్నే వ్రాసినట్లున్నదనుచున్నావా? రూపసాదృశ్య మీశిలాఫలకమున నీవు ప్రతిఫలించుచుంటివా లేక యిది నీచిత్రమా యను విషయము నిర్ధారణ చేయుటకు వీలు గానట్లున్నది.

నాయి——నాచిత్రమును నాకుఁ జూపి నన్నితఁడు దుర్జనురాలిని గావించెను.

విదూ——వయస్య! మీగాంధర్వవివాహ మింతటితోఁ బూర్తియైనది.

అతి త్వరితముగా నిచటికే యెవతెయో వచ్చుచున్నది. కావున నీమెచేతి నింక విడిచిపుచ్చుము.

నాయ—(కొంచెము సవ్వచుఁ జేయి వదలును)

చేటి—(సంతోషముతో సమీపించి) భర్తృదారికా! నీభాగ్యము పండినది. జీమూతవాహనుని తల్లిదండ్రులు నిన్నుఁ గోడలిగా నంగీకరించినారు.

విదూ—(గెంతుచు) ఆహాహా! ప్రియవయస్యునిమనోరథము సిద్ధించినది. కాదు కాదు. పూజ్యురాలగు మలయవతికోర్కి ఫలించినది. కాదు కాదు. ఈబ్రాహ్మణునిభాగ్యము పండినది.

చేటి—(నాయికనుద్దేశించి) మలయవతీవివాహమంగళ మిప్పుడే జరుగ వలసియున్నది. కావున నామెను వెంటఁబెట్టుకొనిర మ్మని కుమారమిత్రావసు వాజ్ఞాపించినాఁడు పోవుదము రండు.

విదూ—ఓసీ! తొత్తుకూఁతుర! రాజపుత్రినిఁ దీసికొనిపోవుచుంటివి నామిత్రుఁ డిచ్చటనే యుండవలయునా?

చేటి—(నవ్వి) హతాశుఁడా! తొందరపడకుము. మీకును స్నపనక మాసన్నమైనది.

(నాయిక నాయకుని సానురాగముగఁ జూచుచు సపరివార ముగా నిష్క్రమించును.)

(తెరలో వైతాళికుఁడు)

సీ. పిష్టాతకమ్మును వెదచల్లి మలయాన
మేరుభూధరశోభ మించఁజేసి
సిందూరధూళిని జిమ్మి ప్రాభాతిక
సంధ్యావిలాసమ్ము జాదుకొలిపి
చరణవిలగ్ననూపురరావములచేత
సమముగాఁ దాళము ల్గఱచికొనుచు

గాంతాసమూహము కలకంఠముల నెత్తి
కావించు నుద్గీతికనులచేత

గీ. సిద్ధలోకమ్ము విన్నవించెడి! కుమార
మాన్యపాలాత్మజాతయా మలయవతికి
జరుగఁబోయెడు నుద్వాహసరణి నీకు
మంగళస్నానవేళ సమంజసముగ.

విదూ—వయస్య! స్నపనకము వచ్చినది.

నాయ—తండ్రిగారికి నమస్కరించి మనము స్నానభూమికిఁ బోవుదము రమ్ము.

గీ. సమవయోరూపభాగ్యవంశములు కలిగి
యొకరినొక్కరు ప్రేమించుచున్నవారు
కలియుట సకృత్తు పుణ్యవంతులకుఁగూడ
నెవరికోగాని యది లభియింపఁబోదు.

(నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

★

# నాగానందము

## తృతీయాంకము

(అంతట మత్తుఁడు విచిత్రవిహ్వాల వేషుఁడు చషకహస్తుఁడు నగు విటుండును స్కంధారోపితసురాభాండుఁ డగు చేటుఁడును బ్రవేశింతురు.)

విటు—(సంతోషముతో)

గీ. ప్రతిదినంబును మదిరను ద్రావువాఁడు
జనుల బ్రియసంగమంబునఁ దనుపువాఁడు
మాకు బలరాముఁ డొకఁడును మన్మథుండు
వేఱొకండును దేవు లుర్వీతలమున.

ఈశేఖరకునిజీవితము సఫలమైనది.

గీ. వక్షమునఁ బ్రియురాలును వదనమందు
నల్లఁగలువలు వాసించు కల్లుముంత
శీర్షమున రకరకముల శేఖరములు
నలరఁబోవని దినమది యరయరాదు.

(తనలో) నన్ను గుంజుచున్నా రెవ్వరు? (సంతోషముతో) అవశ్యము నవమాలికయై యుండును. ఆమెయే ననుఁ బరిహాసించుచుండును.

చేటు—ప్రభూ! నవమాలిక యింకను రాలేదు.

విటు—(కోపముతో) ప్రథమప్రహరముననే మలయవతీవివాహోత్సవము జరిగినది కదా! తెల్లవాఱినను నవమాలిక రాకపోవు

టకుఁ గారణ మేమి? బహుశః సిద్ధవిద్యాధరులందఱు నీమలయ
వతీవివాహసందర్భమునఁ గుసుమాకరోద్యానమునఁ బ్రియు
రాండ్రతో సహపానకేళిఁ ననుభవించుచుందురు. నవమాలిక
నను బ్రతీక్షించుచు నచటనే యుండును. నేనును బోయెదను.
నవమాలిక లేని శేఖరప్రయోజన మేమి?

చేట—భట్టారక! ఇటు ఇటు. ఇదియే కుసుమాకరోద్యాన మిందుఁ
బ్రవేశింపుము.

(ఉభయులుఁ బ్రవేశింతురు)

(అంతట బుజములపై వస్త్రయుగళ్ము ముంచుకొని విదూషకుఁడు
ప్రవేశించును)

విదూ—ప్రియవయస్యుఁ డిప్పుడు కుసుమాకరోద్యానమున కేగు నని
వింటిని. నేను నచటికే పోయెదను. (ప్రవేశించి భ్రమరబాధ
నటించుచు) ఈదుష్టమధుకరములు నన్ను బాధించుచున్న
వెందులకో? తెలిసినది, మలయవతీబాంధవులు పెండ్లికొడుకు
స్నేహితుఁడ నని యొడలినిండ సుగంధద్రవ్యములు పూసి
శిరమున సంతానశేఖరముఁ జుట్టిరి. ఆయాదర మీయనర్థమునకుఁ
గారణమైనది. ఇప్పు డేమి చేయుదును. మలయవతి పంపిన
రక్తవస్త్రద్వయమున స్త్రీవేషమును ధరించి యుత్తరీయ మవ
కుంఠనముగా నైచికొని పోయెదను. అప్పు డీదుష్టమధుకరము
లేమి చేయఁగలవో?"

విట—(సంతోషముతో నిరూపించి) ఓరీ, చేట! అదిగో! నవమాలిక
నన్నుఁ జూచి నే నాలస్యముగా వచ్చితి నని ముసుఁ గిడికొని
యింకొకవైపు పోవుచున్నది. కౌఁగిలించుకొని ప్రసన్నురాలినిఁ
జేసికొందును.

(సత్వరముగాఁ బోయి విదూషకునికంఠము గౌఁగిలించుకొని నోటఁ దాంబూలమిడుటకుఁ బ్రయత్నించును)

విదూ—(మద్యగంధమును సూచించుచు) దూరమురా! దూరము. (అని ముక్కు మూసికొని వెనుదిరిగి) దుష్టమధుకరములబారి నుండి తొలఁగించుకొని యిప్పు డింకొక దుష్టమధుకరముబారిఁ బడితిని.

విటు—కోపగించి పరాఙ్ముఖియైనది. పాదములంబడి ప్రసన్నురాలినిఁ జేసికొందును. (ప్రణామములఁ జేయుచు విదూషకునిపాదములపై శిరస్సు నుంచి) శాంతింపుము, నవమాలికా! శాంతింపుము.

చేటి—భర్తృదారికతల్లి "మలయవతితోఁగూడ జామాత యచటికి రానున్నాఁడు. కావునఁ గుసుమాకరోద్యానమునకుఁ బోయి వనపాలికయగు పల్లవికతోఁ దమాలవీథిని సవిశేషముగా నలంకరింపు" మని దెల్పుమని నా కాజ్ఞాపించినది. ఆయాజ్ఞ వనపాలిక కెఱింగించితిని. రజనీవిరహోత్కంఠితుఁడగు ప్రియవయస్యుఁడు శేఖరకుఁ డెవతెనో బతిమాలుకొనుచున్నాఁడు. ఇచటనే యుండి యీమె యెవ్వరో తెలిసికొందును.

విటు—

క. హరిహరహిరణ్యగర్భుల
గురుతరగర్వప్రసక్తిఁ గొలువని యీశే
ఖరకుఁడు నేఁ డిచ్చట నీ
చరణంబులఁ బడియె ననుచు క్షమియించఁగదే?

విదూ—ఓరీ! తొత్తుకొడుక! మత్తబాలక! ఇచట నవమాలిక యెవరురా?

చేటి—(నవ్వుచు) నే ననుకొనినట్లే మత్తుఁడైన శేఖరకుఁడామెను బతిమాలుకొనుచున్నాఁడు. లేనికోపమునుఁ దెచ్చికొని యీ యిర్వుర నొకింత పరిహసించెదను.

విటు—చేటిని జూచి శేఖరకుని జేతితో నూఁపుచు) ఈమె నవమాలిక కాదు విడిచిపెట్టుము. కోపారుణిత నేత్రయై నవమాలిక యిదిగో వచ్చుచున్నది.

చేటి—(సమీపించి) శేఖరక! ఎవరినిరా బతిమాలుకొనుచున్నావు?

విదూ—(అవకుంఠమును దొలఁగించి) నే నొక మందభాగ్యుఁడను.

విటు—(విదూషకుని జూచి కోపముతో) ఓరీ! కొండముచ్చ! శేఖరకుని గూడ మోసగించుచుంటివా? ఓరీ! చేట! నీవు వీనిని బట్టుకొనుము. నేను నవమాలికను బతిమాలుకొందును.

చేటు—చిత్తము.

విటు—(విదూషకుని వదలి, చేటి పాదములపైఁబడి) శాంతింపుము. నవమాలికా! శాంతింపుము.

విదూ—ఇది తప్పించుకొనుటకు సమయము.

(పాఱిపోఁబోవును)

చేటి—(విదూషకుని యజ్ఞోపవీతములఁ బట్టుకొనును. అవి తెగిపోవును)

విటు—ఓరీ! కొండముచ్చ! ఎచటికిరా! పాఱిపోవుచుంటివి?

విదూ—నవమాలికా! అనుగ్రహించి నన్ను విడిపించవా?

చేటి—నాపాదములకు సాష్టాంగనమస్కారము చేసినచో విడిపింతును.

విదూ—( కోపముతోఁ గంపించుచు) గంధర్వరాజమిత్రుండగు బ్రాహ్మణుఁడనై నీకు నమస్కరింపవలయునా? తొత్తుకూఁతుర!

చేటి—(చిటికెనవ్రేలితో జడిపించి నవ్వుచు) ఎందులకు మ్రొక్కవో చూచెదను. శేఖరక! నీయందుఁ బ్రసన్నురాలనైతిని. (కౌఁగిలించుకొని) అల్లుఁడుగారిస్నేహితుని దట్టితి వని మిత్రావసువు

వినినచో నీపైఁ గోపగింపఁ గలఁడు. కావున నీతని నాదరించి గౌరవింపుము.

విటు——నవమాలికయాజ్ఞ? (విదూషకుని గాఁగిలించుకొని) ఆర్య! నీవు సంబంధివని యెంచి పరిహసించితిని (తలమోఁదుచు) శేఖరకుఁ డున్మత్తబాలకుఁ డగుట నిజమే నా?

విదూ——కాదు, కాదు.

విటు——(సంతోషముతో) ఇఁకఁ బరిహాసము చాలును (ఉత్తరీయము చుట్టచుట్టి) సంబంధీ! ఇచ్చటఁ గూర్చుండుము.

విదూ——(తనలో) అదృష్టవశమున నీతనికై పు వదలినది.

(కూర్చుండును)

విటు——నవమాలికా! నీవుఁ గూడ నీతనిప్రక్కఁ గూర్చుండుము. మీ కిరువురకు సమానముగ సన్మానము చేయుదును.

చేటి——(నవ్వి కూర్చుండును)

విటు——ఓరీ చేట! ఈమురంత కల్లుతో నింపుము.

చేటు——(నాట్యమున నింపును)

విటు——(చషకమును జేతఁబుచ్చుకొని స్వశిరశ్శేఖరమునుండి పూవులఁ దీసి యందుంచి మోఁకరించి నవమాలిక కిచ్చి) నవమాలికా! నీవు రుచిచూచి యీతని కిమ్ము.

చేటి——నీయిష్టము (అని త్రాగి చషకమును విటున కందించును)

విటు——(చషకమును విదూషకున కందించి) నవమాలికా! ముఖ సంసర్గవాసితమగు సుర శేఖరకుఁడు తప్ప నితరులు త్రావి యెఱుఁగరు, దీనిని ద్రావుము. ఇంతకంటె నీ కధిక సన్మాన మేమి కలదు?

విదూ——(నవ్వుచు) శేఖరక! నేను బ్రాహ్మణుఁడనురా!

విటు——నీవు బ్రాహ్మణుఁడవైనచో బ్రహ్మనూత్ర మేదీ

విదూ—(తడివిచూచుకొని) చేటుఁడులాగుటలోఁ దెగిపోయినది.

చేటి—(నవ్వుచు) పోనీ నాలుగు వేదాక్షరముల నుచ్చరింపుము.

విదూ—కల్లువాసనతో నవి యంతరించినవి. నీతో వాద మెందులకు? నీకాళ్ళుఁ బట్టుకొందును.

చేటి—వలదు, వలదు. శేఖరక! తొలఁగుము, తొలఁగుము. ఈతఁడు నిజముగ బ్రాహ్మణుఁడే! (పాదములపైఁబడి) ఆర్య! సంబంధి వగుటచేఁ బరిహాసమాడితిని, క్షమింపుము.

విటు—నేనును బతిమాలుకొందును. (పాదములపైఁబడి) ఆర్య! క్షమింపుము. ఒడలు తెలియక యపరాధ మొనర్చితిని, క్షమింపుము. నవమాలికతోఁగూడఁ బానశాలకుఁ బోయెదము.

విదూ—క్షమించితిని, పొండు. నేనును నాప్రియవయస్యునిదగ్గఱకుఁ బోయెదను.

(చేటి చేటుఁడు విటుఁడు నిష్క్రమింతురు)

విదూ—అదృష్టవశమున బ్రాహ్మణున కపమృత్యువు తొలఁగినది. మత్తబాలకుని ముట్టుకొనినదోషమును దీర్ఘికలో స్నానమాడి పోఁగొట్టుకొని ప్రియవయస్యుని జూతును. (అట్లేచేసి నేపథ్యాభిముఖముగఁ జూచి) స్వయంవరలక్ష్మి మూర్తీభవించిన ట్లున్న మలయవతిపాణి గ్రహించి నాప్రియవయస్యుఁ డిట్లే వచ్చుచున్నాఁడు. నేనును బోయి యాతనిపార్శ్వవర్తి నగుదుఁగాక! (అంతట వివాహవేషాలంకృతుఁ డగు జీమూతవాహనుఁడు మలయవతియు విభవోచితపరివారముతోఁ బ్రవేశింతురు)

నాయ—(మలయవతినిఁ జూచి)

చ. పలుకదు పల్కరింపఁ దల వంచు, దనున్ గనుఁగొన్న వేళ నా
కలకుఁ దొలంగు, శయ్యపయిఁ బల్కినిఁ గౌఁగిటఁజేర్ప భీతివి

హ్వాలయుగుc, దాను లేచు గది యావలకున్ సఖు లేగుచుండ, నీ
'లలి విముఖత్వమూని ప్రియురాలు నవోఢ ప్రియుమ్మో కూర్చెడిన్.
ప్రియురాలా! మలయవతి!

ఉ. "ఊ" యని మాత్రమే పయికి నుత్తరమిచ్చుచు మౌన మూని హా
హా! యని వేడివెన్నెల దవానలమున్ బలె లేచుచుండc గ
న్మోయక రేబవళ్ళు తలపోయుచుc జేసిన నాతపఃఫల
శ్రీ యని నీముఖం బిపుడు చేడియ చూచుచునుంటి నెమ్మెయిన్.

నాయి—(హర్షముతో) ఓసీ! చతురికా! దర్శనీయుcడగుటయే కాక యీతనికిc బ్రియముగా మాటలాడుటగూడc దెలియునే!

చతు—ఓసీ! ప్రతిపక్షపాతిని! ఇది నిజమే! ఇందుc బ్రియవచన మే మున్నది.

నాయ—చతురికా! కుసుమాకరోద్యానమునకు దారిc జూపుము.

చేటి—ప్రభూ! ఇటు, ఇటు.

నాయ—(పరిక్రమించి) ప్రియురాలా! మెల్ల మెల్లగ రమ్ము.

చ. నడుము వడంకcజేసెడి ఘనస్తనభారము హారమేటికే
తడcబడుచున్న వూరులు నితంబభరమ్మునc గాంచి యేలొకో?
పడcతి! పదమ్ము లూరువుల బర్వు సహింపని వందె లేల? నీ
తొడవులు నీఘనాంగములె దుఃఖముకోసమె వీనిc దాల్చితే?

చేటి—ఇదియే కుసుమాకరోద్యానము.

(అందఱును బ్రవేశింతురు)

నాయ—ఏమి యీయసమానసౌందర్యము!

సీ. చందనద్రవముచే శైత్యంబు పొదరిండ్ల
నలరుచున్నది కుట్టిమాంతములకు
ధారాగృహోదకధ్వానమ్ము విని కేకి
యాడుచున్నది లయ ననుసరించి

ఆపాతపరిపీడ నలఁతిగా రాలిన
బహుపుష్పరజముచేఁ బచ్చఁబడుచు
యంత్రవిచ్యుతము వృక్షాలవాలమ్ములఁ
బరువెత్తుచున్నది వారిధార

గీ. మొదలిడినపాట కుంజభూములను మ్రోయ
సరవిఁ బుష్పోడిబుక్కాముఁ జల్లికొనుచు
సఖులతో మధురసమాను షట్పదంబు
లలరు నాపాన మను కేళి నమరినట్లు.

విదూ—(సమీపించి) వయస్య! నీకు విజయమగుఁగాక! అమ్మా! నీకు శుభమగుఁగాక!

నాయ—మి మా! ఇంత యాలస్య మొనర్చితి వేమి?

విదూ—త్వరగనే వచ్చితిని. కాని వివాహమంగళోత్సవమునఁగలసిన సిద్ధవిద్యాధరు లాపానక మనుభవించుచుండఁ జూచు కుతూహలముతోఁ గొంతసేపు తిరుగుచు నాలస్య మొనర్చితిని. మిత్రమా! అటు చూడుము.

నాయ—అవును నీ వనినట్లే! (బాగుగా నిరూపించి)

మ. పెలుచన్ మద్యము ద్రావుచుండిరి ప్రియాపీతావశేషంబు సి
ద్ధులతోడన్ హరిచందనం బొడలియందున్ మాళిసంతానమా
లలు వెల్గొందఁగ నచ్ఛవస్త్రములపై రాజన్మణీదివ్యభూ
షలు చిత్రింప వయస్య! చందనతరుచ్ఛాయాళి విద్యాధరుల్.

మనము ను దమాలవీథికిఁ బోవుదము రండు.

(అందఱును బరిక్రమింతురు)

విదూ—తమాలవీథి శరదాతపఖిన్నమగు నీవదనమువలె నున్నది. అమ్మా! క్షణకాల మీస్ఫటికశిలాతలమ్మున నాసీనురాలవు కమ్ము.

నాయ—వయస్య! బాగుగా వర్ణించితివి.

గీ. చెక్కిళులకాంతిచేత నీచెలియముఖము
శీతరశ్మిని మును జయించినది కాన
నిప్పు డాతపరక్తమై యేపుమీఱి
కమలమునుగూడ నిర్జింపఁగాఁ దలంచె.

(మలయవతినిఁ జేతఁబట్టుకొని)

ప్రియురాలా! ఇచటఁ గూర్చుందము.

(అందఱును గూర్చుందురు)

నాయ—(నాయికముఖమునెత్తి చూచుచు) ప్రియురాలా! కుసుమాకరోద్యానకుతూహలినై నిన్ను వృథాయాస పెట్టితిని.

క. అరుణాధరపల్లవసం
భరితంబై భ్రూలతాళిఁ బరఁగుచు నీ సుం
దరవదనము నందనమై
వరలఁగ నితరంబు లేల? వనమాత్రంబుల్.

చేటి—(నవ్వుచు విదూషకుని జూచి) మారాజపుత్రి యెట్లు వర్ణింపఁబడుచున్నదో వింటివా?

విదూ—చతురికా! మాయందును దర్శనీయాకృతులు లేకపోలేదు. కాని యనూయచే వర్ణింపరు.

చేటి—అయ్యా! నిన్ను నేను వర్ణింపనా?

విదూ—బ్రతికిపోయితిని. నీకడుపు చల్లఁగా వర్ణింపుము. మరల నీతఁడు నను జూచి, అటువంటివాఁడ విటువంటివాఁడవు కొండముచ్చవని నిందింపకుండ వర్ణింపుము?

చేటి—అయ్యా! వివాహజాగరమున నిద్ర నాఁపుకొనలేక నీవు కునికిపాట్లు పడుచున్నప్పుడు చాల నందముగాఁ గనిపించినావు. ఇపుడు గూడ నట్లే యున్నచో వర్ణించెదను.

విదూ—(కనులు మూసికొనును)

చేటి—(తనలో) ఈతఁడు మరల గనులు తెఱవకమునుపే చీకటియాకుల రసముచే ముఖమునకు నల్లరంగు వేయుదును.

(లేచి చీకటిచిగుళ్ళు నలుపుచుండును. నాయికానాయకులు విదూషకునిఁ జూతురు)

నాయ—వయస్య! మమ్ము విడిచి యీమె నిన్నే వర్ణించుటచే ధన్యుఁడ వైతివోయి! (చేటి చీకటియాకులరసముతో విదూషకుని మొగమును నలుపుఁ గావించును. నాయకుని జూచి నవ్వును)

నాయ—(నాయికాముఖముఁ జూచి)

గీ. అధరపల్లవమందు ముగ్ధాక్షి! యిపుడు
చిఱునగవుపేరి కుసుమంబు చెంగలించెఁ
దత్ఫలముమాత్ర మితరత్ర దనరు దాని
గనుఁగొనఁగ నోఁచికొన్న నా కన్నులందు.

విదూ—చేటీ! ఏమిచేసితివే?

చేటి—ఏమియును లేదు. మీరు వర్ణింపఁబడితిరి.

విదూ—(చేతితో ముఖము దుడుచుకొని చేయి నల్లనగుటఁ జూచి చేతి కఱ్ఱ నెత్తి) ఓసీ! తొత్తుకూఁతుర! రాజకులమగుటచే బ్రతికి పోయితివే! అయ్యో! మీయెదుటనే నన్నీతొత్తుకూఁతు రవమానించినది. నే నిచట నుండి ప్రయోజన మేమి? ఎటకేనియుఁ బోయెదను.

(అని వెడలిపోవును)

చేటి—ఆర్యుఁడగు నాత్రేయునకుఁ గోపము వచ్చినది. పోయి బతిమాలుకొందును.

(వెళ్ళఁబోవును)

**నాయి**—ఏమే చతురికా! న న్నేకాకినిఁ జేసి పోయెదవా?

**చేటి**—ఇట్లేకాకినివై చిరకాల ముండుము.

(వెళ్ళిపోవును)

**నాయ**—(నాయికముఖమును జూచి)

**చ.** వదన మహాస్కరాంశుపరిపాటలమై తనరారుచుండఁగా
రదనమయూఖవిస్ఫుటతరమ్ములు కేసరము ల్వహించి నీ
యది కమలంబె నమ్ముము యథార్థముగా మధువానునట్టి దే
వ్యాదియును దేఁటి యిందుఁ దిరుగాడుట కన్పడ దేమి నెచ్చెలీ!

**నాయి**—(నవ్వుచు ముఖ మింకొకవైపు త్రిప్పుకొనును)

**నాయ**—(సురల నదియే పఠించును)

**చేటి**—(పటాక్షేపముగాఁ బ్రవేశించి) ఆర్యమిత్రావసు వవసరముండి కుమారుని జూచుట కిదె వచ్చుచున్నాఁడు.

**నాయ**—ప్రియురాలా! నీ వంతిపురి కరుగుము. మిత్రావసునిఁ జూచి నేనును ద్వరగఁ జనుదెంచెదను.

(నాయిక చేటితోఁ గూడ నిష్క్రమించును)

(మిత్రావసువు ప్రవేశించును)

**మిత్రా**—

గీ. అతని జంపకుండ నయ్యయో నీరాజ్య
మెల్ల శత్రువు హరియించె ననుచు
నెటులఁ దెల్పువాఁడ నిపుడు నే జీమూత
వాహనునకు సిగ్గు వదలివైచి.

చెప్పకుండుట మంచిదికాదు. కావునఁ జెప్పియే పోయెదను?

**నాయ**—మిత్రావసు! ఇచ్చటఁ గూర్చుండుము.

(మిత్రావసువు కూర్చుండును)

**నాయ**—మిత్రావసు! ఇంతసంరంభ మెందులకు?

మిత్రా—మతంగఘాతకుని యందు సంరంభ మెందులకు?

నాయ—మతంగుఁ డేమి చేసినాఁడు.

మిత్రా—వినాశకాలము వచ్చి నీరాజ్య మాక్రమించుకొనినాఁడు.

నాయ—(సంతోషముతో) ఇది సత్యమే యగునా?

మిత్రా—నీ వాజ్ఞాపించినచో,

మ. పలుగాకిఁ భవదీయశాత్రవు నభోభాగమ్మునన్ నాల్గుమూ
లలకుఁ బోవు విమానయానములఁ జేరంబోయి యవ్వాని సి
ద్ధులు యుద్ధంబున రూపడంచెదరు చేతుల్మోడ్చు నీకున్ రసా
తలపర్యంతము రాజచక్రము భయోత్పాతంబు సంధిల్లఁగన్.

పలుపల్కు లెందులకు,

గీ. శరభసాకృష్టనిస్త్రింశచటులరోచి
రంకితసటాభరుఁడనై యద్రినుండి
దుముకుచు మతంగజము హరి దునుమునట్టు
లే నొకండనె వధియింతు నీ మతంగు.

నాయ—(చెవులుమూసికొని తనలో) అయ్యో! ఎంతదారుణమైన
మాట వినవలసివచ్చినది.

(ప్రకాశముగా) మిత్రావసు! ఇదియేమి? నీబాహుబలము జగత్ప్ర
సిద్ధమే! అయినను,

గీ. పరులు కోరకుండ వారిపై దయచేత
నీశరీరమైన నిచ్చువాఁడ
నెటుల నైతుఁ జెప్పు మీ ప్రాణివధ రాజ్య
మసలు లేకయున్న నదియు మేలె.

నాకుఁ గ్లేశములయందుఁదప్ప నితరత్ర శత్రుబుద్ధియే లేదు. నాకు హిత
మాచరించుతలం పున్న యెడలఁ గ్లేశవశీకృతుఁడగు నీదీనునియం
దనుకంపఁ జూపింపుము.

మిత్రా—(కోపముతో) మన కుపకారముజేసి కృతజ్ఞుఁడైన యీదృశునియం దనుకంప చూపఁ కెట్లుందును?

నాయ—(తనలో) నవనవోన్మేషకోపాకులచిత్తుని వీని నిప్పుడు నివర్తించుట సులభము గాదు. (ప్రకాశముగా) మిత్రావసు! లెమ్ము, అభ్యంతరమునకుఁ బోవుదము. అచ్చటనే నీకు బోధింతును. దిన మప్పుడే పరిణతమైనది. అస్తమయము నొందుచున్నప్పుడుఁగూడ మిాసిద్ధు లెవని వినుతింతురో, ఆ యీదివాకరుఁడొక్కఁడే శ్లాఘాపాత్రుఁడు. ఏలయన,

మ. తమితోడన్ జనుదెంచి ముక్తినిడు నిద్రాముద్రితాంభోజకో
శములందున్ జెఱవడ్డ తేఁటులకు నాశాపూరణైకక్రియా
ప్రముఖానంతమయూఖజాలముల విశ్వప్రీతిఁ గావించు ని
త్యము నివ్వాని ఘనప్రయాస యితరార్థప్రాప్తి చేకూర్పఁగన్.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.

# నాగానందము

చతుర్థాంకము

(రక్తవస్త్రద్వయము చేఁబూని కంచుకియును బ్రతీహారియుఁ

బ్రవేశింతురు)

గీ. రాజితం బయ్యె నంతఃపురవ్యవస్థ
యనుపదస్ఖలితంబుల నవలఁ ద్రోసి
దండనీతిజరాభరితుండ నగుచు
ననుసరించెద నృపవృత్తమును సతంబు.

ప్రతీ—ఆర్య! వసుభద్ర! ఎచటికి బయలుదేఱితివి?

కంచు—మహారాజమిత్రావసుజనని "కంచుకీ! దశరాత్రము మలయవతికిని జీమూతవాహనునకు రక్తాంశుకమ్ములుగొని యీయవలయు"నని యాజ్ఞాపించినది. రాజదుహితయగు మలయవతి శ్వశురకులమున నున్నది. జీమూతవాహనుఁడు యువరాజమిత్రావసుసహితుఁడై సముద్రతీరమును దర్శింపఁబోయినాఁడని వింటిని. రాజపుత్రీసకాశమునకుఁ బోవలయునో జీమూతవాహనునికడకుఁ బోవలయునో తెలియకున్నది.

ప్రతీ—ఆర్య! రాజపుత్రికడ కేగుటయే మంచిది. జామాతగూడఁ గొలఁదికాలములో వచ్చుటకి రాఁగలఁడు.

కంచు—సునంద! బాగుగా నుపదేశించితివి. నీ వెచ్చటకుఁ బోవుచుంటివి?

ప్రతీ—మహారాజవిశ్వావసువు సునంద! ఈదీపప్రతిపదుత్సవమున జామాత కనురూపమగు బహుమతి యీయవలయును గావున వచ్చి నిరూపింపు మని మిత్రావసువుతోఁ దెల్పు మని నాకాజ్ఞాపించినాఁడు. నేనును యువరాజును బిలిచికొనిరాఁ బోయెదను. (అని నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

(అంత జీమూతవాహనుఁడు మిత్రావసువు ప్రవేశింతురు)

నాయ—

సీ. తరువులక్రింద నుత్తమవాసగృహములు
పఱచినశయ్య శాద్వలతలంబు
భద్రాసనంబులు పాండుగోపలములు
మృగములే నమ్మినమిత్రవరులు
పానము శీతలస్వచ్ఛనిర్ఝరవారి
కందమూలమ్ము లాఁకలి హరించు
ప్రార్థించుకొనని దే పడసినదీయది
వనభూమిఁ గలుగునైశ్వర్యమెల్ల
గీ. యాచకులు కానరాక పరార్థఘటన
మెట్టిదో సుంత తెలియక యిచటిజనులు
జీవితమ్ముల వ్యర్థముచేయుచుండి
రను టొకటి మాత్రమే దోష మని తలంతు.

మిత్రా—(పైకిఁ జూచి) త్వరపడుము, త్వరపడుము. సముద్రమునకుఁ బోటువచ్చుకాలము సమీపించినది.

నాయ—అవు నవును.

మ. జలదంతావళిమజ్జనాతిరభసాస్ఫాలానుబంధోద్ధతిన్
బలవంతమ్మయి శైలకందరములన్ బ్రాపించి మార్మ్రోయు న
జ్జ్వలనాదంబులఁ గర్ణపీడ గలుగఁగా సంచాలితానంతసం
కులశంఖావళిఁ దెల్లనై తరఁగపొంగు ల్మీర నేతెంచెడిన్.

మిత్రా—దగ్గఱకే వచ్చినది చూడుము,

గీ. కబళితలవంగపల్లవకలనఁ జేసి
తృప్తిఁగని కరిమకరముల్ ద్రేన్చుచుండఁ

దత్సుగంధాన్వితోదకతరళమైన
యుదధివేల రత్నద్యుతి నొప్పుచుండె.

జలము స్రవించుమార్గము వదలి గిరిసానుసమీపమార్గమునఁ బరిక్ర మింతము.

నాయ—(పరిక్రమించి చూచి) మిత్రావసు! ఈమలయాచలసానువులు తెల్లని శరన్మేఘములచే నాక్రమింపఁబడిన మంచుంగొండశిఖరములవలె నొప్పుచున్నవిసుమా!

మిత్రా—కుమార! ఇవి మలయాచలసానువులు కావు. నాగుల యస్థిపంజరగుట్టలుగాక (పోవులు).

నాయ—ఎంతకష్టము వీనికి సంఘాతమృత్యు వెందులకుఁ దటస్థించినది.

మిత్రా—సంఘమరణము రాలేదు. చెప్పుచుంటిని వినుము. తనఱెక్కల గాలిచే సమస్తాంబునిధిజలమును విరఁజిమ్మి రసాతలమునందలి నాగులను గాలించి వైనతేయుఁ డనుదినమును సంహరింప మొదలిడినాఁడు.

నాయ—అతికష్టమైన కార్యమున కాతఁడు పూనుకొనినాఁడే!

మిత్రా—అంతట సమస్తనాగలోకవినాశమును శకించి నాగరాజు గరుత్మంతుని కిట్లు వచించినాఁడు.

నాయ—తన్ను మొదట భక్షింపుమనియా?

మిత్రా—కాదు, కాదు.

నాయ—ఇంకేమని.

మిత్రా—నీయభిపాతభయమున భుజంగాంగనాగర్భములు సహస్రములుగా స్రవించుచున్నవి. శిశువులుఁగూడఁ జనిపోవుచున్నారు. అందువలన మాకు సంతతివిచ్ఛేద మగుచున్నది. నీకును స్వార్థహాని, కావున సరిగ నీవువచ్చు వేళకు సముద్రతటమున కొక్కనిఁ బంపుచుందు ననియెను.

నాయ—నాగరాజు పన్నగులను రక్షించుట కెంత మంచి యుపాయ
మాలోచించినాఁడు.

గీ. నాగరక్షకొఱకు నాయాత్మ నొసఁగెద
నహివిరోధి నీకు నని వచింప
వఱలదే రసజ్ఞ వాని యా ద్విసహస్ర
జిహ్వలందు నొక్క జిహ్వ కేని!

తరువాతఁ దరువాత.

మిత్రా—పక్షిరా జందుల కంగీకరించినాఁడు.

చ. జరగిన యీవ్యవస్థకును సమ్మతిఁ గాంచిన పక్షిరాజు తా
నరుసగఁ బ్రత్యహంబునను బన్నగముల్ భుజియించుచుండె న
య్యురగుల యస్థికూటము లహో యివి శీతగిరీంద్రరోచులై
పెరిఁగెఁ బెరుంగఁగాఁగలవు పెర్గుచునున్నవిసూ! కుమారకా!

నాయ—(ఆశ్చర్యముతో)

గీ. అశుచిమాంసము కృత మరయ లేనిది నాశ
మెనయు నట్టి దీ శరీర మనుచుఁ
దెలివి సుంత లేక దీనికై చేయుదు
రెన్ని పాడుపనుల నేని యకట!

పాప మంతములేని విపత్తి నాగులకుఁ దటస్థించినది. (తనలో) ఈనా
శరీర మొసఁగి యొక్క పన్నగప్రాణమైన రక్షింపఁగలనా!

(అంతటఁ బ్రతీహారి ప్రవేశించును)

ప్రతీ—గిరిశిఖర మెక్కితిని, మిత్రావసు వెచట నున్నాఁడో పరీక్షించె
దను (చూచి) అదిగో మిత్రావసువు జామాతృసమీపమున
నున్నాఁడు. (సమీపించి నమస్కరించి) కుమారులకు విజయ
మగుఁగాక!

మిత్రా—సునంద! నీవువచ్చినపని యేమి?

(ప్రతీహారి చెవిలోఁ జెప్పును)

మిత్రా——కుమారా! తండ్రిగారు న న్నాజ్ఞాపించుచున్నారు.

నాయ——నీవు వెళ్ళుము.

మిత్రా——బహుప్రత్యవాయములుకల్గిన యీప్రదేశమునఁ జిరకాలము మాత్ర ముండకుము?

(అని ప్రతీహారితోఁగూడ నిష్క్రమించును)

నాయ——ఈగిరిశిఖరమునుండి దిగి సముద్రతీరము నవలోకించెదను.

(పరిక్రమించును)

(నేపథ్యమున) అయ్యో పుత్రా! శంఖచూడ! నీవు చనిపోవుచుండ నే నెట్లు చూడఁగలనురా?

నాయ——(విని) ఎవ్వరో స్త్రీ యేడ్చుచున్న ట్లున్నది. సమీపించి యామెకు వచ్చినభయ మేమియో కనుఁగొందును.

(పరిక్రమించును)

(అంతట నేడ్చుచున్నవృద్ధజననిచే ననుగమ్యమానుఁడగు శంఖచూడుఁడును గోపాయితవస్త్రయుగళుండగుకింకరుఁడును ప్రవేశింతురు)

వృద్ధ——అయ్యో ! పుత్ర ! శంఖచూడ ! నీవు చనిపోవుచుండ నెట్లు చూడఁగలనురా ? నీముఖచంద్రవిరహితమైనచో నాహృదయమును రసాతలమును నంధకారబంధురములు కాఁగలవు.

శంఖ——అమ్మా!అతిమాత్రముగా దుఃఖించుచు నాకుఁగూడ దుఃఖముఁ గలిగింపకుము.

వృద్ధ——(చిరకాలముచూచి కొమరునియంగములఁ దడవి) నాయనా! సూర్యకిరణములఁ జూచియైన నెఱుంగని సుకుమారుఁడగు నిన్నాగరుడుఁ డెట్లు చంపునురా?

(కాఁగిలించుకొని గట్టిగా నేడ్చును)

శంఖ——అమ్మా! ఏడువకుము.

గీ. మొదట ధాత్రేయివలె నంకమున ఘటించు
కొను ననిత్యత జననమొందినయతనిని
జనని యొడిఁ జేర్చుఁ దరువాత నని గ్రహింపు
మక్రమంబుగ దుఃఖింప నగునె? తల్లి!

వృద్ధ—పుత్ర! ఒక్కముహూర్తకాల మాఁగుము. నీముఖముఁ దని
వారఁ గాంచెదను.

కింక—(సాక్షేపముగా) కుమారా! శంఖచూడ! పుత్రస్నేహమోహి
తురాలగు నీజనని రాజకార్య మెఱుఁగదు. త్వరపడుము.

శంఖ—వచ్చుచున్నాను.

కింక—(తనలో) వధ్యశిలాసమీపమునకు వీనిని దీసికొనివచ్చితిని.
వధ్యచిహ్నములగు రక్తాంశుకములను గట్టిపెట్టి వధ్యశిలఁ జూపిం
చెదను.

నాయ—ఆస్త్రీ యీమెయే! (శంఖచూడునిఁ జూచి) ఈమె తన
కొమరునిఁ జూచియే దుఃఖించుచున్నది. భయకారణ మేమియుఁ
గాన్పించుట లేదు. సమీపించి భయమొందుటకో కనుఁగొందును.
క్రమముగా నీమె యాలాపముల నది బహిర్గతము కావచ్చును.
కావున నీ విటపాంతరితుఁడనై యాలకింతును. (అట్లేచేయును)

కింక—(కన్నీటితోఁ గృతాంజలియై) కుమార! శంఖచూడ! స్వామి
యాదేశమగుటచేత నీదృశకఠినకార్యమునకుఁ గడంగితిని.

శంఖ—(శిరసునఁ నంజలిఘటించి) నాగరాజేమియాజ్ఞాపించుచున్నాఁడు.

కింక—రక్తవస్త్రద్వయమును ధరించి వధ్యశిల నధిరోహింపుము.
నీరక్తాంశుకములఁ జూచి గరుడుఁడు నిన్నాహారముగా
గ్రహింపఁగలఁడు.

నాయ—గరుత్మంతుని యాహారముకొఱకీ తపస్విని నాగరాజు
వదలుట కష్టమయముగాఁ గాన్పించుచున్నది.

కింక—శంఖచూడ! ఇవి గ్రహింపుము.

శంఖ—(సాదరముగా) ఏవి? (పుచ్చుకొని) స్వామియాదేశమును శిరసా వహించెదను.

వృద్ధు—(పుత్రునిహస్తములయందు రక్తవస్త్రములఁ గాంచి ఱొమ్ము బాదుకొనుచు) ఇది పిడుగుపాటువలెఁ గాన్పించుచున్నది.

(అని మూర్ఛిల్లును)

కింక—పక్షిరాజువచ్చువేళ యైనది. నే నిచటనుండి త్వరగఁ బోయెదను.

శంఖ—అమ్మా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

వృద్ధు—(కన్నీటితో) హా! పుత్ర! హా! మనోరథశతలబ్ధ! హా! వినయసాగర! పూర్ణిమాచంద్రసదృశమగు నీముఖ మిఁక నెచటఁ జూచెదరా?

(కౌఁగిలించుకొని యేడ్చును)

నాయ—

మ. నిను రక్షించెడువార లెవ్వరును లేనే లేరె పుత్రా! యటం
చును నల్దిక్కులఁ జూచి కన్నుఁగవ నశ్రుల్ నించుచున్నట్టి యా
జననీసన్నిధియందె వీనిఁ దినునే చల్పాది పక్షీంద్రుఁ డా
తని చంచ్వగ్రము మాత్రమే యనను చిత్తంబున్ ద్రుపత్తే కదా?

శంఖ—(దుఃఖావేగముచే మాతృహృదయాస్ఫోటమును శంకించుచు)

సీ. యాచకు ల్దరిఁజేరి యర్థింప నేవార
లడిగినదాని లేదని యెఱుఁగరో?
అన్యులకోసమై యాత్మార్థ మేవార
లేనాఁడు మది గణియింప లేదో?
ఇతరులు దుఃఖమ్ము నెనయుచో నేవార
లది తమదుఃఖమే యని తలఁచిరో?

సత్వహింసకు సైఁపఁజాలక రక్షింప
నసువులే యేవార లొసఁగినారొ?

గీ. అట్టిసాధులు చనిపోయి రవనియందు
నొక్క-రేనియుఁ గాన్పింపరోసి!, యిపుడు
బాష్పవేగంబు నుడుగుము పాప మెవ్వ
రెదుట నున్నార లనుచు దుఃఖింతువమ్మ!

(తనచేతితోఁ దల్లికన్నీరుఁ దుడిచి) ఇంత విచార మెందుకమ్మా!
ఊఱడిల్లుము.

వృద్ధ—పుత్రా! ఎట్లూరకుందునోయి? ఒక్కఁడే కుమారుఁ డని తలఁచి
యైన నాగరాజగువాసుకి నిను మానిపింపలేదుకదా? ఓరీ!
కృతాంతహతక! ఇన్నిజీవు లవిచ్ఛిన్నముగా బ్రతుకుచుండ
నాకొమరునొక్కని నీవు మఱవలేకపోయితివా? మందభాగ్య
రాల నన్నివిధములఁ బాడైతిని.

నాయ—(సకరుణముగా)

గీ. ఆర్తుఁడయ్యెఁ గంఠమందుండెఁ బ్రాణమ్ము
లెల్లబాంధవులుఁ ద్యజించినార
లిట్టివాని నిప్డు డేఁ బ్రోవకున్నచో
నీశరీర ముండి యేమిఫలము?

సమీపించెదను.

శంఖ—అమ్మా! ఊఱడిల్లుము.

వృద్ధ—అయ్యో! శంఖచూడ! నాగలోకరక్షకుఁడగు వాసుకియే నిన్ను
వదలివైచెను. అన్యులెవ్వరు రక్షించెద రెట్లూరకుందును.

నాయ—(సమీపించి) నేను నేను.

వృద్ధ—(గరుడభీతిచేఁ బుత్రునిఁ దనయుత్తరీయముచేఁ గప్పి) వినతా
నందన ! నన్ను భక్షింపుము. నాగరాజు నీయాహారమునిమిత్త
మీనాఁడు నన్నుఁ బంపినాఁడు.

నాయ—(కన్నీటితో) ఆహా! ఏమి యీపుత్రవాత్సల్యము.

గీ. పుత్రవాత్సల్యమునఁజేసి పొగులుచున్న
యీముసలిదానిదైన్య మీక్షించెనేనిఁ
గరుణ యెఱుఁగని యల భుజంగమవిరోధి
మనము తప్పక ద్రవియించు నని తలంతు.

శంఖ—

చ. ఉరగవిరోధి కాఁడితఁ డహో! భయమందఁగఁబోకు మాఫణా
ధరనిరవద్యమస్తకవిదారణదుర్భరరక్తసిక్తభీ
కరతరచంచు వాతనికిఁ గల్గునె? సామ్యత సుంతయైన నీ
వరయుము సాధుమూర్తి కరుణార్ద్రము లీతనికన్ను లమ్మరో!

వృద్ధ—పుత్రా! నీమరణశంకితురాలనగు నాకు లోకమంతయు గరుడ మయముగాఁ గాన్పించుచున్నది.

నాయ—అమ్మా! భయపడకుము. నీ పుత్రరక్షణార్థ మరుదెంచిన విద్యాధరుఁడను, ధైర్యము వహింపుము.

వృద్ధ—తండ్రీ! మరల నాయక్షరములే పఠింపుము.

నాయ—మాటిమాటికిఁ జెప్పుట యెందులకు? చేసియే చూపించెదను.

వృద్ధ—(శిరస్సున నంజలి ఘటించి) తండ్రీ! చిరకాలము జీవింపుము.

నాయ—

గీ. వధ్యచిహ్నరక్తవస్త్రద్వయం బిమ్ము
వాని దాల్చుకొందు మేన నిపుడె
పక్షిరాజు నన్ను భక్షించు నీపుత్రుఁ
డరయుఁగాక! చిరతరాయు వంబ!

వృద్ధ—(చెవులుమూసికొని) పాపము శాంతించుఁగాక! నాకు శంఖ చూడుఁ డెట్లో నీవు నట్లె. కాదు కాదు. బంధుజన పరిత్యక్తుఁ

డగు నాపుత్రుని నీశరీరదానముచే రక్షింపనెంచితివి, కావున నంతకంటె నధికుఁడవు.

శంఖ—(విషాదముతో) ఈసాధుపుంగవునిచిత్తము జగద్విపరీతముగా నున్నది.

శా. నాడీజంఘునిఁజంపె గౌతమకృతఘ్నత్వమ్ము, మాలం డనన్
బాడైపోయిన కుక్కమాంసమును విశ్వామిత్రుఁడే మెక్కె నీ
పాడున్ బొట్టకుఁ గశ్యపాత్మజుఁ డహిప్రాణమ్ములన్ దీయు నే
నాఁడున్ వీనికి జీవితంబు తృణమైనన్ గాదె? యన్యార్థమై.

(నాయకునుద్దేశించి) మహాత్మా! ఆత్మప్రాణదానవ్యవసాయనిర్వ్యాజమగు దయ నాయందుఁ జూపించితివి. నీకు నిర్బంధము వలదు.

గీ. మాదృశక్షుద్రజంతువుల్ మహినిఁ బుట్టి
గిట్టుచుందురు గాని నీయట్టివార
లన్యహితకార్యదీక్షితు లరుదు కానఁ
బ్రస్తుతవ్యవసాయము వదలు మయ్య.

నాయ—(చేతితోఁ బట్టుకొని) కుమార శంఖచూడ! నాపరార్థసంపాదనమనోరథమునకుఁ జిరకాలావకాశము లభించినది; నీ వంతరాయముఁ గల్పింపకుము. ఎదురుచెప్పక వధ్యచిహ్నముల నా కొసంగుము.

శంఖ—మహాత్మా! సాహసికాగ్రణీ! నీప్రయాస మనవసరము. శంఖధవళమగు శంఖపాలుని కులమును మలిన మొనర్పువాఁ డీ శంఖచూడుఁడు కాఁడు. నాయందు దయగలదేని యస్మద్విపత్తివిక్లబయగు నాజనని జీవితములఁ బాయకుండఁ గాపాడు నుపాయ మాలోచింపుము.

నాయ—ఆలోచింపవలసిన దేమున్నది. ఇదివఱకే యాలోచించితిని. అది నీ యధీనమున నున్నది.

శంఖ—అది యెట్లు ?

నాయ—

గీ. నీవు చచ్చినచోఁ జచ్చు నీవు బ్రతికి
యున్నచో నీమె జీవించియుండుఁ జుమ్ము
జననిఁ గాపాడు వాంఛయే న్వినుము నేను
బ్రాణ మొసఁగెద నిన్నుఁ గాపాడికొనుము.

ఇదియే యుపాయము. కావున వధ్యచిహ్నము లొసంగుము. వీనినిఁ గట్టికొని వధ్యశిల నే నధిరోహింతును. నీవు జననితోఁ గూడ నీప్రదేశమునుండి తొలఁగి పొమ్ము. సమీపముననున్న వధ్యశిలను నీమె యీక్షించినచో స్త్రీస్వభావసులభముగాఁ బ్రాణములఁ బాయవచ్చును. విపన్నపన్నగానేకకంకాళసంకులమగు శ్మశానము నీకుఁ గాన్పించుటలేదా?

సీ. తరళచంచ్వగ్రవిదారితచ్యుతమాంస
లవములకొఱకు స్పర్థను వహించి
యాబద్ధచక్రంబులై మింట గ్రద్దలు
ఱెక్కలల్లార్చి పరిభ్రమింప
నాదిత్యమండలమది యదృశ్యంబౌట
నంధకారము దిక్కు లాక్రమించె
శమితశిఖండముల్ చరియించు నంతట
నేయడ్డమును లేకయే నెమిళ్ళు

గీ. బహుళతరవినిస్రుతవసావాసవిస్ర
రుధిరవాహిని వెల్వడి రోదనంబు
సల్పుచున్నవి నక్క లుచ్చైస్స్వనమున
నడె శ్మశానము కానుపింపదె? కుమార!

శంఖ—చూడ కెట్లుందును!

క. ప్రతిదిన పన్నగహారా
చ్యుత మనిశ వినాయకాహితోత్సవమగు నీ
పితృభూమి రుద్రతను వను
గతిఁ దుహినాంశుధవళాస్థికకపాలంబై.

ఈసామోపన్యాసముల కేమి? నీవు దయయుంచి వెడలుము. గరుడుఁ డేతెంచుసమయ మైనది (తల్లియెదుట మోఁకరించి శిరఃముపై నంజలి ధరించి) అమ్మా! నీవుఁగూడ వెడలిపొమ్ము.

గీ. నిన్నుఁబోలి సుతప్రీతి నెఱపువార
లరుదు కారకురాల వీ వగుము నాకు
నెన్నిజన్మంబు లీపయి నెత్తనున్న
నన్నివిధముల జన్మంబులందుఁ దల్లి!

వృద్ధ—తండ్రీ! ఇదియే నీకడసారిమాటయా? నిన్నువిడిచి యీపాదము లొక్క యడుగైన నావలకుఁ బెట్టనేరవు. నేనును నీతోడనే మరణింతును.

శంఖ—(లేచి) ఉత్తరముగా నిచటి కనతిదూరమున నున్న గోకర్ణేశ్వరునకుఁ బ్రదక్షిణ మొనర్చి వచ్చి స్వామియాదేశమును నిర్వర్తించెదను.

(తల్లితో నిష్క్రమించును)

(అంతట రక్తవస్త్రద్వయమును బట్టుకొని కంచుకి ప్రవేశించును)

కంచు—ఈరక్తవస్త్రద్వయమును దేవియగు మిత్రావసుజనని కుమారుఁడు ధరింపవలయు నని పంపినది. కావున వీనిని ధరింపుము.

నాయ—(సంతోషముగా) అతర్కితోపపన్నములగు నీరక్తవస్త్రములు నాకోర్కి సిద్ధించుటకుఁ దగిన సాధనములు. కంచుకీ! వాని నిటు తీసికొనిరమ్ము.

కంచు—(బట్టల నిచ్చును)

నాయ—(పుచ్చుకొని ధరించి) మలయవతీపాణిగ్రహణ మీనాఁటికి ఫలించినది. (ప్రకాశముగా) కంచుకీ! నాకు మాఱుగా దేవి గారికి నమస్కరింపుము.

కంచు—చిత్తము. (నిష్క్రమించును)

నాయ—

క. అరుణాంబరయుగళం బిది
పరియగుసమయాన దొరకి సాధించిన దీ
పరకీయార్థాచరణా
దరునకు నవకాశ మొకటి ధన్యుఁడ నైతిన్.

(దిక్కులఁ జూచి)

సీ. మలయాద్రిపైనున్న మహితపాషాణముల్
జరజర క్రిందికి జాఱుచున్న;
వనిలవేగవశమ్ము లయి భూమి ముంచునో
యన నొప్పుఁ దీరమం దలలగుంపు
పక్షతిపంక్తిసంవర్తకాభ్రంబులో
యన నభోవీథిపై నాక్రమించె
సరయుచున్నవి భీతి నష్టదిగ్గజములు
కల్పాంతకాలశంకను వహించి

గీ. కపిశవర్ణంబు దిక్కులఁ గడలుకొనియె
ద్వాదశాదిత్యు లొకమాటె తనరినట్లు
సన్నిహితుఁ డయ్యెఁ గాఁబోలుఁ బన్నగేంద్ర
హారతత్పరుఁడైన విహంగరాజు.

ఈశంఖచూడుఁడు రాఁకముం దీవధ్యశిల నధిరోహింతును.

(అట్లే చేసి)

(శిలాస్పర్శ నభినయించుచు)

క. ఫలసిద్ధికొఱకు నే నీ
శిలఁ గాఁగిటనున్న సుఖము సిద్ధింపదు త
న్మలయవతీఘనచందన
పలిలార్ద్రవపుర్మనోజ్ఞ సంస్పర్శమునన్.

మలయవతిమాట యెందులకు?

గీ. వధ్యశిల వసింప వఱలునానందంబు
చిన్ననాఁడు తల్లిచెంతఁ జేరి
యంకమందు నిద్రనందినయపుడేని
యనుభవించియుండ నని తలంతు.

గరుత్మంతుఁ డరుదెంచినాఁడు. ఈబట్టల నాచ్ఛాదించుకొని యుందును.
(అట్లే చేయును)

(అంత గరుత్మంతుఁడు చనుదెంచును)

గరు—

సీ. తనమేను భయవశమ్మునఁ జుట్టజుట్టిన
శేషాహిమూర్తినిఁ జిత్తమందుఁ
దలఁపింపఁజేసిన తారకానాథుని
బింబదర్శనమునఁ బ్రీతిఁగాంచి
స్యందనాశ్వత్రాసచలితుఁడై సూర్యుఁడు
కనుఁగొనుచున్నయగ్రజునిప్రక్క
నతఁడు మోదంబుతో నరయుచుండఁగ నేగి
లఘుగతి నబ్ధివేలకును డిగ్గి

గీ. సానులఁజరించు మేఘపుంజములతెక్క
లాయతినిఁ గాంచఁగా మలయాచలంబు
క్షణములోఁ జేరుకొంటి భుజంగహార
సత్వరబుభుక్షు తీవ్రమై సందడింప.

నాయ—(సంతోషముతో)

గీ. ఒడలు దాన మిచ్చి యురగసంరక్షణ
సేయుచున్న పుణ్యసిద్ధివలన
భవములలరునేని పరహితార్థమ్ముగాఁ
గాయ మలరుచుండుఁగాక నాకు.

గరు—ఇదియే వధ్యశిల!

మ. భరితాస్మద్భయదీర్యమాణహృదయప్రస్యందిరక్తంబుచే
నరుణంబైనటు లున్నవస్త్రముల శేషాహీంద్రసంరక్షకో
పరమై తాల్చిన భోగివక్షమును వజ్రప్రాయచంచ్వగ్రస
త్వర భిన్నం బొనరించుకొంచు భుజియింపన్ బైకిఁ గొంపోయెదన్.

(వధ్యశిలపై వ్రాలి నాయకుని గ్రహించును. నేపథ్యమునఁ బుష్పవృష్టి దుందుభిధ్వానము నలరారును)

గరు—(ఆశ్చర్యముతో)

మ. అలరారున్ దివి సూనవృష్టి యళిరాడాస్వాదితామోద మా
శలు మార్మ్రోయఁగ మ్రోయుదుందుభు లవే స్వర్గమ్మునం దేలొకో
(ఆలోచించి) ఆ! తెలిసినది.
చలితంబయ్యెను బారిజాతతరు వస్మత్పత్రవాతాహతిన్
బలవంతమ్ముగ మ్రోయు లోకలయమున్ భావించి సంవర్తముల్.

నాయ—(తనలో) భగవంతునిదయచేఁ గృతార్థుఁడ నైతిని.

గరు—(నాయకునిఁ గబళించుచు)

కం. బరువనిపించుచు నున్నాఁ
డరయఁగ నీనాఁడు నాకు నహిరక్షకుఁ డీ
య్యురగాశనకాంక్షను స
త్వరముగఁ దొలఁగించు ననుచుఁ దలఁచుచు నుంటిన్.

కావున వీనిని మలయపర్వతాగ్రమునకుఁ గొంపోయి యథేష్టముగా భుజింతును. (అని నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.

# నాగానందము

## పంచమాంకము

(అంతటఁ బ్రతీహారి ప్రవేశించును)

ప్రతీ—గీ. మైత్రిచే స్వగృహోద్యానమధ్య నలరు
సన్నిహితులందె పాపపుశంక వొడము
వేఱె చెప్పంగవలయునే విపదుదగ్ర
ఘోరకాంతారసీమలోఁ జేరియున్న.

జీమూతవాహనుఁడు జలధివేలావలోకనకుతూహలియై వెడలి యింత వఱకు రాలేదని మహారాజ విశ్వావసువు చింతాక్రాంతుఁడై సునంద సన్నిహితగారుడప్రతిభయమగుప్రదేశమునకుఁ "గుమారజీమూతవాహనుఁ డేగినాఁ డని వినినప్పటినుండి నాకు భయమగుచున్నది. నీవు సత్వరముగ నేగి యింటికేతెంచినది లేనిది తెలిసికొనిర"మ్మని యాజ్ఞాపించినాఁడు. (పరిక్రమించి) అదిగో, జీమూతవాహనునితండ్రియు రాజర్షియు నగు జీమూతకేతు వుటజాంగణమున సహధర్మచారిణియును గోడలగు మారాజపుత్రియును సేవింపఁ గూర్చుండినాఁడు. జీమూతకేతున కిప్పుడు సాగరమర్యాద పట్టినది.

చ. తళతళలాడి మేన ముదుతల్పడు క్షామయుగ మ్మొకింత ఫే
నలలితమా తరంగములనన్ విలసిల్లు సుతోయమైన గం
గ లలిని జెంతఁ బుణ్యవతి గాదిలిదేవి వసించుచుండె నా
వల నలరారు కోడ లలవార్నిధివేల యనన్ జరించెడిన్.

ప్రవేశించెదను.

జీమూ—

చ. అరసితి జవ్వనంబు సుఖ మందితిఁ గీర్తిని నిల్పుకొంటి సు
స్థిరమతి రాజ్య మేలితిని జేసితిఁ గొంతతపస్సు పుత్త్రుఁ డం
దఱకును మాన్యుఁ డీవధు వుదారసమాన్వయజాత నా కిఁకన్
మరణము సంభవించునెడ మానుకజన్మ కృతార్థమే యగుఁ.

ప్రతీ—(త్వరగఁ బ్రవేశించి) జీమూతవాహనునకు—

జీమూ—(చెవులుమూసికొని) పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక!

వృద్ధ—అమంగళము ప్రతిహతమగుఁగాక!

నాయి—(తనలో) ఈదుర్నిమిత్తముచే నాహృదయము కంపించుచున్నది.

జీమూ—భద్రుఁడా జీమూతవాహనున కేమి!

ప్రతీ—జీమూతవాహనుని వార్త తెలిసికొనుటకై మహారాజ విశ్వావసువు నన్ను మీయొద్ద కంపించినాఁడు.

జీమూ—నాకుమారుఁ డచటికి రాలేదా?

ప్రతీ—లేదు.

వృద్ధ—(విషాదముతో) అచటికిఁ బోకుండిన నాకుమారుఁ డింకెచటికిఁ బోయియుండును?

నాయి—(విషాదముతో) నా కిఁక నార్యపుత్త్రునిఁ జూచు భాగ్యము లేదేమో యని భయమగుచున్నది.

జీమూ—జీమూతవాహనుఁ డాలస్యము చేయుచున్నకొలఁది నాహృదయ మాందోళనము నొందుచున్నది. (ఎడమకన్నదరుట సూచించి)

గీ. మాటిమాటికి నదరెడు వేటి కిట్టు
తేయునిష్టము గలుగు వామేక్షణంబ!

స్ఫురిత మరికట్టుకొంటి నాసుతుఁడు సేమ
మరయఁగాఁగలఁ డోసి! నీయాశ కూల!

(పైకిఁ జూచి) అదిగో! త్రిభువనైకచక్షువగు భగవంతుఁడు సహస్ర
దీధితి. జీమూతవాహానునకు శ్రేయస్సు తప్పక కల్గును.

చ. కనుఁగొనుచుండఁ గన్నులకు గాసిని గూర్చుచు రక్తకాంతి త
ద్ఘనరుచిపుంజ మన్నటులుగా గురియించుచు ఘోరమారుత
మ్మునఁ జలియించు తారవలె ముందరవచ్చి నభమ్మునుండి భూ
మినిఁ బడుచుండె నేమి యిది మిక్కిలి విస్మయమున్ ఘటించెడిన్.

చరణములయందే పడినదే!

(అందఱును విస్మయముతో నిరూపింతురు)

జీమూ—మాంసలగ్నమగుచూడామణి యిది యెవ్వరిదో కదా?

వృద్ధు—మహారాజ! ఈ చూడారత్నము మన పుత్రునిదే!

నాయి—(అపవారించి) అట్లనకుము)

ప్రతీ—మహారాజ! బాగుగాఁ దెలిసికొనకుండ విచారింపకుము. గరు
త్మంతుఁడు నాగేంద్రమును భక్షించుచుండ నఖముఖోత్ఖాతము
లైన వానిశిరోమణు లనేకము లిచటఁ బడుచుండును.

జీమూ—దేవీ! సునందుఁడు సకారణముగా నిరూపించినాఁడు. ఒకప్పు
డదియుఁ గావచ్చును.

వృద్ధు—సునందా! ఈపాటికి నాపుత్రుఁడు శ్వాశురగృహమునకుఁ
జేరియుండునేమో పోయి కనుఁగొనిరమ్ము.

(అని నిష్క్రమించును)

ప్రతీ—చిత్తము.

జీమూ—దేవీ! ఇది నాగచూడామణియే యగునా? (అంతట రక్త
వస్త్రములు ధరించి శంఖచూడుఁడు ప్రవేశించును)

శంఖ—(కన్నీటితో) అతికష్ట మతికష్టము. దేవునిచే మోసగింపఁ
బడితిని.

గీ. అర్ణవతటానఁ ద్వరగ గోకర్ణు మ్రొక్కి
వధ్యశిలఁజేరి గోళ్ళతో వక్షమందుఁ
బట్టి విద్యాధరాత్మజుఁ బక్షిరాజు
గగనసీమకు నెగయుట గాంచినాఁడ!

హా! మహాసత్త్వ! హా! పరమకారుణిక! హా! నిష్కారణబాంధవ!
హా! పరదుఃఖదుఃఖిత! హా! విపద్వార్ధిపతితజనపోత! హా!
పరోపకారతృణీకృతదేహ! ఎచటకుఁ బోయితివి? నాకుఁ
బ్రతివచన మీయవా? (తన్నుద్దేశించుకొని) ఓరీ! శంఖచూడ
పాతక! నీ వేమి చేసితివిరా?

మ. ఒకనాఁ డే నహిరక్షణప్రథను నీ వూహింపలేవైతి తా
నక రాజాజ్ఞ శిరోవహం బిది యొనర్పం జాలకేపోతి వూ
రక వంచించె నతండు నీకొఱకు స్వప్రాణమ్ములన్ బాసి; యెం
తకునే న్నాలెన పుట్టిఁగట్టికొని యుండంగోరితే భూమిపై.

ఈగతిఁ బరిహాసపాత్రుఁడనై జీవింపఁజాలను. ఈ రుధిరధార ననుస
రింపఁ బ్రయత్నించెదను.

సీ. మొదట నుద్ధురవేగమునఁ బైకి నెగయుచు
నతివిశాలమ్ముగా నవనిఁ దడిపి
తరువాత నెడముగాఁ దఱచుగా స్థూలబిం
దువులుగాఁ బుడమిపై నవతరించి
యాపైని నుపలపర్యంకంబులన్ బడి
యత్యంతతనుకణ మ్మగుచుఁ జిమ్మి
యావెన్క ధాతుపీఠావళిఁబడుటలోఁ
గంటికి నొక్కింత కానరాక

గీ. స్త్యానసీలమై తరుశిఖరాళిఁ బడుచు
స్థలములందుఁ బిపీలికాస్వాద్యమైన
యస్రధారను నేర్పుతో ననుసరింతు
వైన తేయుదిదృక్ష సాఫల్యమొంద.

వృద్ధు—(సాధ్వసముతోఁ జూచి) మహారాజ! ఏడ్పుమొగముతో నీవంకకుఁ ద్వరితముగా వచ్చుచున్నాఁ డీతఁ డెవ్వరో కనుఁగొందురా!

జీమూ—అట్లే.

శంఖ—హా త్రిభువనైకచూడామణీ! హా పరార్థదత్తదేహా! నిన్నెచ్చటఁ జూడఁగలను, నన్ను వంచించితివి.

జీమూ—(సంతోషముతో విని) దేవీ! విచారము వదలుము. ఇతని యొక్కచూడామణి మాంసలోభముచే నేపక్షియో తన్నుకొనిపోయి యిచటఁ బాఱవైచినది.

వృద్ధు—(సంతోషముతో మలయవతినిఁ గౌఁగిలించుకొని) సౌభాగ్యవతీ! ధైర్యము వహింపుము.

మల—(సంతోషముతో) మీయాశీర్వచనప్రభావముచేత;

జీమూ—వత్సా! నీ చూడామణి హరింపఁబడినదా?

శంఖ—లేదు లేదు, త్రిభువనచూడామణియే హరింపఁబడినాఁడు.

జీమూ—ఎట్లు?

శంఖ—దుఃఖభారమువలన బాష్పోపరుద్ధకంఠుఁడనై చెప్పఁజాలకున్నాను.

జీమూ—

గీ. ఇంక నాత్మీయమున్ వచియింపుమోయి
పుత్ర దుస్సహదుఃఖమ్ము పూర్తిగాఁగ

నదియు నాయందు సంక్రాంత మాయెనేని
బరువు తగ్గఁగవచ్చు నీపయి నొకింత.

శంఖ—అట్లైన వినుము. నేను శంఖచూడుఁడను నాగేంద్రుఁడను. వైనతేయాహారావసరముగ వాసుకి నన్నుఁ బంపినాఁడు. అతి విస్తరమెందులకు. ఈరక్తధారాపద్ధతి ధూళిధూసరితమై కొంత సేపటికిఁ గాన్పింపకపోవచ్చును. సంక్షేపముగనే తెల్పెదను.

క. కరుణాత్ముఁ డొక్కవిద్యా
ధరుఁ డేతెంచి నిజదేహదానంబున ని
య్యురగప్రాణంబు లొగిన్
బరిరక్షణ సేసి కీర్తిభాసురుఁ డయ్యెన్.

జీమూ—జీమూతవాహనుఁడుతప్ప నితరు లెవ్వ రింత పరహితవ్యసను లగుదురు? వత్స! నీపుత్రుఁడగు జీమూతవాహనుఁడే యని స్ఫుటముగఁ జెప్పరాదటోయి? ఎంతమందభాగ్యుఁడ నైతిని?

వృద్ధ—పుత్రా! ఎంతపనిఁ జేసితివిరా?

నాయి—అయ్యో! నాదుర్నిమిత్తము చివరకు సత్యమైనదా?

(అందఱును మూర్ఛపోవుదురు)

శంఖ—(కన్నీటితో) మహాసత్త్వుఁడగుజీమూతవాహనుని తల్లిదండ్రుల కప్రియవాదినై యీయవస్థం దెచ్చిపెట్టితిని. విషధరవదనము నుండి విషముగాక యితర మెట్లు వచ్చును. 'ఉపకారియగు జీమూతవాహనునకు శంఖచూడుఁడు మంచిప్రత్యుపకారము నే చేసినాఁడు. నేనుగూడఁ దత్క్షణమే చనిపోయెదను. కాదు కాదు. వీరి నోదార్పవలసియున్నది. తండ్రీ! ఊఱడిల్లుము. అమ్మా! ఊఱడిల్లుము.

(ఇద్దరును మూర్ఛదేఱుదురు)

వృద్ధు—(మలయవతి నుద్దేశించి) వత్సా! లెమ్ము. ఏడువకుము. జీమూత
వాహనుఁడు లేనిదే మేము మాత్రము జీవింపఁగలమా? ఊఱ
డిల్లుము.

నాయి—ఆర్యపుత్ర! నిన్నిపు డెచ్చటఁ జూడఁగల్గుదును!

జీమూ—హా! వత్స! గురుజనశుశ్రూషాభిజ్ఞ!

క. చరణంబులఁ జూడామణి
నొరగుచుఁ బడవైచి యిప్పు డోహో లోకాం
తరమున కేగియు నీదా
గురువినయాధికతఁ జూపుకొంటివె వత్సా!

(చూడామణి గ్రహించి) వత్స! ఏతావన్మాత్రదర్శనమే నా కిగిలినది?
(గుండెల కద్దికొని)

గీ. చరణములఁ జాలసారులు సాగిలఁబడి
వినయమున నీవు మ్రొక్కెడు వేళఁ గంటిఁ
గమణమసృణ మీరత్నము గాఢరీతి
హృదయము నిదేల నేఁడు భేదించుచుండె.

వృద్ధు—పుత్రా! జీమూతవాహన! గురుజనశుశ్రూషకొఱ కితర సుఖ
ములు వదలుకొనువాఁడ విప్పు డెట్లు తండ్రిని విడిచి స్వర్గసుఖ
మనుభవింపఁ బోయితివిరా?

జీమూ—(కన్నీటితో) దేవీ! నీ విట్లు ప్రలపించెదవు. జీమూతవాహనుని
వీడి మనము బ్రతికియుండఁగలమా?

నాయి—(పాదములపైఁబడి యంజలిబంధించి) మామా! ఆర్యపుత్రుని
యంగాభరణచిహ్నమగు చూడారత్నము నా కొసంగుఁడది
హృదయమున ధరించి యగ్నిప్రవేశ మొనరించి సంతాపదుఃఖ
మపనయించుకొందును.

జీమూ—అమ్మా! పతివ్రత! తొందరపడకుము. మనకందఱ కదియే గతి.

వృద్ధు—మహారాజ! దేనికొఱకు నింకను బ్రతీక్షించుచున్నారు?

జీమూ—ఆహితాగ్నుల కింకొకనియగ్ని సంస్కారము పనికిరాదు. అందు వలన నగ్నిహోత్రగృహమునుండి యగ్నిం దెచ్చుకొని దాహకృత్యము నెఱవేర్చుకొందము.

శంఖ—(తనలో) ఈనికృష్టుఁడు పాపమొనర్చుటవలన సకలవిద్యాధర వంశము నశించుచున్నది. (ప్రకాశముగా) తండ్రీ! నిశ్చయము తెలియనిదే మన మెట్టిసాహసమును జేయఁగూడదు. విధివిలాసము లతివిచిత్రములు. జీమూతవాహనుఁడు నాగులలో నొకఁడు కాఁడని యెఱింగి భుజగవిరోధి యాతనిని జీవించియుండఁగనే విడిచిపుచ్చవచ్చును. అందువలన నీరుధిరధార ననుసరించి నేను నైనతేయుని సమీపించెదను.

వృద్ధ—భగవంతునిదయచేతఁ బుత్రుఁడు జీవించియుండఁగనే చూచెదముగాక !

నాయి—(తనలో) ఈమందభాగ్యురాలి కంతటి యదృష్టము లభింపదు.

జీమూ—వత్సా ! నీవాక్యము లవితథము లగుఁగాక ! మేము నగ్నిసహాయులమై నిన్ననుసరించుట యుక్తము. నంతతరక్తధారను నీ వనుసరించి యేగుము. మే మగ్నిహోత్రగృహమునకుఁ బోయి యగ్నులఁ గైకొని త్వరితముగనే యరుదెంతుము.

(అని పత్నీవధూసమేతుఁడై నిష్క్రమించును)

శంఖ—నేను గరుడు ననుసరింతును.

(పరిక్రమించి యెదుటఁ జూచి)

మ. కులిశోదగ్రములైన వాఁడినఖముల్ గోత్రస్థలిన్ ద్రవ్వఁగా
నల నుద్దీప్తవిలోచనాగ్నిశిఖల నర్కొండించి రక్తార్ద్రిపం
కిలచంచ్వగ్రవిఘట్టితాశ్మములు రక్తిన్ ద్రోణులన్ జేయుచున్
మలయాగ్రంబున దూరమై కనఁబడున్ మా వన్నగద్వేషియే !

(ముందర నాయకుఁడు పడియుండ నాసనస్థుఁడైన గరుడుఁడు ప్రవేశించును)

గరు—(తనలో) జన్మప్రభృతి భుజంగపతులను భక్షించుచుంటిని గాని యిట్టి యాశ్చర్యముఁ జూచి యెఱుఁగను. ఈమహాసత్త్వుఁడు బాధనొందకపోవు టటులుండ సంతోషించుచున్నట్లు కాన్పించుచున్నాఁడు.

చ. కనఁ డిసుమంత బాధ యధికంబుగ రక్తముబిల్చుచుంటి మో
మున వెత లేదు మాంసమును ముక్కున లాగఁ బ్రసన్నమయ్యె నో
య్యన నవిలుప్త దేహమున నయ్యవె పుల్కలు కీడొనర్చినన్
గనుఁగొనుచుండె నన్ను హితకారకురీతి నిదేమి ధైర్యమో!

ఈతని ధైర్యవృత్తిచే నాకుతూహల మధికమగుచున్నది. కాన భుజించుట మాని యీతఁ డెవ్వరో కనుఁగొందును.

(తినుట మాని యెదుట నిలువఁబడును)

నాయ—

గీ. ఇప్పుడు శిరాముఖమ్ముల నేకధార
యగుచు రక్తము గారు, దేహమున మిగిలెఁ
బలలము మహాత్మ! తృప్తికన్పడదు తినుట
మానివైచితి వేమయ్య! వైనతేయ!

గరు—(తనలో) ఆశ్చర్య మాశ్చర్యము! ఇటువంటి యవస్థలోఁ గూడ నీతఁ డెంత యూర్జితముగ మాటలాడుచున్నాఁడు. (ప్రకాశముగా) ఓయీ! మహాసత్త్వ!

గీ. శోణితము దీసినాఁడఁ జంచువును జొన్పి
నేను నీహృదయమునుండి; కాని యిప్పు
డనితరప్రాప్యమైన ధైర్యమును జూచి
హృదయమే నాది నీవు గ్రహించినావు.

మహాత్మా! నీ వెవరవో తెలియఁగోరుచున్నాను.

నాయ—నీ కింకను నాఁకలి తీరలేదు. కావున వినిపించుట కిది సమయము గాదు. మొదట నా మాంసశోణితములచేఁ దృప్తిఁ దీర్చికొనుము.

శంఖ—(ససంభ్రమముగా వచ్చి) తార్క్ష్య! తార్క్ష్య! సాహసమొనరింపకుము. ఆతఁడు నాగేంద్రుఁడు కాఁడు. కావున వదలి నన్ను భక్షింపుము. నీయాహారార్థము వాసుకిచేఁ బంపఁబడినవాఁడను నేనే!

(అని వక్షము నొసంగును)

నాయ—(శంఖచూడునిఁ జూచి తనలో) ఈ శంఖచూడుఁడు వచ్చి నామనోరథము విఫలముచేయుచున్నాఁడు.

గరు—(ఇర్వురఁ జూచి) ఇర్వురకు వధ్యచిహ్నము లున్నవి. ఇందులో నాగ మెవ్వరో తెలియకున్నది.

శంఖ—నీవు భ్రమింపవలసిన యావసరము లేదే!

మ. కలుగుంగావుత స్వస్తికం బురమునన్ గన్పింపదే కూస మెం
దులకుం జూడవు రెండునాలికలు నీతోఁ బల్కుచున్నప్డు డా
వల నుద్వేలవిషాగ్నిధూమపటల వ్యాజిహ్మరత్నాంశువై
తల నూఁగాడదొకో ఫణాత్రయము చింతాసీత్కృతివ్యాప్తమై.

గరు—(శంఖచూడుని ఫణములను గాంచి నాయకునిఁ జూచుచు) అయినచో నే నెవరినిఁ జంపితిని?

శంఖ—విద్యాధరవంశతిలకుఁడగు జీమూతవాహనుని నిర్దయాత్ముఁడవై చంపితివి?

గరు—(తనలో) ఈతఁడు విద్యాధరకుమారుఁడగు జీమూతవాహనుఁడా?

మ. సురశైలంబున వెండికొండపయి మంచున్ గుబ్బలిన్ మందరో
పరి వింధ్యాద్రి మహేంద్రమందు మలయప్రాగ్భారమందుండి టి

గ్వరకుంజంబుల నిల్చి చారణులు లోకాలోకసంచారు లా
దర మానందము కల్గి పాడునెడ నీ ధన్యాత్మకీర్తిప్రథల్.

అన్నివిధముల నఘపంకమున దిగఁబడితిని.

నాయ—ఓయీ! ఫణిపతీ! ఉద్విగ్నుఁడ వైన ట్లుంటి వేమి?

శంఖ—ఆవేగమునకుఁ గారణమే లేదా?

గీ. నీశరీరము ద్యజియించి నాశరీర
మిపుడు పక్షీంద్రునుండి రక్షింపనేల
నల రసాతలమే క్రింది దంతకన్న
నా కధోగతిఁ దెచ్చుట న్యాయమగునె?

గరు—ఆహా! కరుణార్ద్రచేతస్కుఁడగు నీమహానుభావుఁడు నా కాహా రార్థమై వచ్చినఫణిని సంరక్షించుటకై తనదేహము నా కాహారము చేసినాఁడు. పలుపల్కు లెందులకు? బోధిసత్త్వునే నే నీనాఁడు చంపితిని. ఈమహాపాతకమును బోఁగొట్టుకొనుటకు నా దేహ మగ్ని కాహుతిఁ జేసికొందును. ఇప్పు డగ్ని యెచ్చట సంపాదించుకొందును? (ముందునకు చూచి) ఎవ్వరోగాని యగ్నులఁ బట్టికొని యిచ్చటికే వచ్చుచున్నారు. వారిరాకఁ బ్రతీక్షించెదను.

శంఖ—కుమారా! నీతలిదండ్రులు వచ్చుచున్నారు.

నాయ—శంఖచూడ! సమీపించి వస్త్రములతో న న్నాచ్ఛాదించి పట్టుకొనుము. ఈదృశావస్థలో నన్నుఁ గాంచి నాతలిదండ్రులు శరీరత్యాగ మొనరింతురేమో?

శంఖ—(అట్లే చేయును) (అంతటఁ బత్నీవధూసమేతుఁడై జీమూతకేతువు ప్రవేశించును)

జీమూ—పుత్రా! జీమూతవాహన!

మ. పరు లాత్మీయులు నంచు లేదు దయకున్ పాటింపు సుంతైన నో
 క్కరొ రక్షింపఁగఁ బెక్కురో యను వివేకం బుండఁగారాదె? నీ
 వురగార్థంబయి ప్రాణమిచ్చుటకు ముం దొక్కింత యోజింపవే
 మిర? తండ్రిన్ జననిన్ దలోదరిఁ గులమ్మో యిట్లు మాయించెదే?

వృద్ధు—(మలయవతినుద్దేశించి) వత్సా! ముహూర్తకాలము విరమింపుము. నీయవిరళాశ్రుపాతముచేత నీయగ్నిజ్వాలలు చల్లారును. కావున నేడువకుము.

(అని పరిక్రమింతురు.)

జీమూ—హా! పుత్రా! జీమూతవాహన!

గరు—(విని) పుత్రా! జీమూతవాహన యని యేడ్చుచున్నా రెవ్వరో! ఇతఁ డీతని తండ్రి యని సువ్యక్తమగుచునే యున్నది. అగ్ని యడుగుదునా? పుత్రుని జంపి సిగ్గులేక మొగ మెట్లు చూడఁ గలను. అగ్నికొఱకు విచారించుట యెందులకు? ఈజలధి లేదా?

మ. ప్రళయాగ్నింబలె భీతిగొల్పుచును జిహ్వాభంగముల్ ముజ్జగం
 బుల భక్షించెడు కాలునాలికలనన్ బొల్పొంద సప్తాంశువుల్
 జలధుల్ గడ్డిని బోలి మ్రింగునటు పక్షాధూతవాతంబు లు
 జ్జ్వలముల్ జేసిన బాడబాగ్నిఁ బడి నా పాపంబు చల్లార్చెదన్.

నాయ—ఓయీ! విహంగరాజ? ఈప్రయత్నమును మానుము. నీవు చేసినపాపమున కిది నిష్కృతి కాఁజాలదు.

గరు—(మోఁకరించి యంజలి బంధించి) మహాత్మా! ఏదియో తెల్పెదవా?

నాయ—క్షణకాల మాఁగుము. నాతలిదండ్రులు వచ్చినారు. వారికి నమస్కరించెదను.

గరు—చిత్తము.

జీమూ—(చూచి సంతోషముతో) దేవి! మన భాగ్యము పండినది. మనకుఱ్ఱవాఁడు జీవించియుండుటయే కాదు. గరుత్మంతుఁడు శిష్యునివలెఁ గృతాంజలియై సేవించుచున్నాఁడు చూచితివా?

వృద్ధ—(సంతోషముతో) కృతార్థురాలనైతిని. అక్షతశరీరుఁడగు పుత్రునిఁ జూడఁగోరెదను.

నాయి—నిజముగా నార్యపుత్రుని జూచుచున్నను నతిప్రియమగుటఁ దక్షణమే నమ్మఁజాలకున్నాను.

జీమూ—(సమీపించి) నాయనా! రమ్ము రమ్ము! నన్నుఁ గౌఁగిలించుకొన వేమి?

నాయ—(లేవఁబోయి, ఉత్తరీయము పడిపోవఁగా మూర్ఛిల్లును)

శంఖ—కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

జీమూ—చూచియు నను విడనాడితివిరా! తండ్రీ!

వృద్ధ—నాయనా! ఒక్కమాఱు పల్కరించుటకైన నోఁచికొననా?

నాయి—ఆర్యపుత్ర! గురుజనులఁగూడ నెట్లుపేక్షించితివి?

(అందఱును మూర్ఛఁబొందుదురు)

శంఖ—ఓరీ! శంఖచూడహతక! పరాత్మరక్షితజీవిత! పుట్టినతోడనే చచ్చితివిగా వేమిరా? క్షణక్షణమును మరణముకంటె నెక్కువయగుదుఃఖ మనుభవింపకుండ నుండెడిది కాదా?

గరు—ఇదియంతయు దుర్మార్గుఁడనగు నా యసమీక్ష్యకారిత్వముచే ఘటించినది. (ఱెక్కలతో విసరుచు) మహానుభావా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

నాయ—శంఖచూడ! తలిదండ్రుల నోదార్పుము.

శంఖ—తండ్రీ! ఊఱడిల్లుము. అమ్మా! ఊఱడిల్లుము. జీమూతవాహనుఁడు మూర్ఛదేఱినాఁడు. మిమ్ముల నోదార్చుటకుఁ గష్టపడి లేచి కూర్చుండియున్నాఁడు. (ఇద్దఱు మూర్ఛదేఱుదురు.)

వృద్ధ—తండ్రీ! చూచుచుండఁగనే నిను గృతాంతహతకుఁ డెత్తి
కొని పోవుచున్నాఁడే!

జీమూ—దేవీ! అమంగళము లాడకుము. ఆయుష్మంతుఁడు జీవించియే
యున్నాఁడు. కోడలి నోదార్పుము.

వృద్ధ—(ముఖము చెంగుతోఁ దుడిచికొని యేడ్చుచు) అమంగళము
ప్రతిహతమగుఁగాక! ఏడువకూడదు. (మలయవతి నుద్దేశించి)
అమ్మా! ఊఱడిల్లు మూఱడిల్లుము. లెమ్ము లెమ్ము. ప్రియుని
ముఖము దనివారఁ జూడుము.

నాయి—(మూర్ఛనుండి లేచి) హా! ఆర్యపుత్ర!

వృద్ధ—(మలయవతిముఖము చేతితోఁ దుడిచి) అమ్మా! చిర
సౌభాగ్యవతివి కమ్ము.

జీమూ—(కన్నీటితోఁ దనలో)

చ. మిగిలిన వన్నియంగములు మేన విలుప్తములౌటఁజేసి ని
ల్వఁగ నొకయింత వీలయిన పట్టెదియుఁ లభియింపకున్కిఁ గం
ఠగతములైన ప్రాణములు డస్సి కుమారుఁడు వీడుచుండ విం
తగఁ బరికింతుఁగాని శతధా హతదేహము వ్రయ్య దేలొకో!

నాయి—ఆర్యపుత్ర! ఈదృశావస్థయందు నినుఁ గాంచుచు దేహము
బరిత్యజింపఁజాలని నే నెంత దౌర్భాగ్యురాలను?

వృద్ధ—(నాయకుని యంగములను జేతితోఁ దడవుచు గరుడు నుద్దే
శించి) ఓరీ; దురాత్ముఁడ! ఆభరణములకుఁగూడ నాభరణమైన
నాపుత్రుని శరీర మెట్టి దుస్థితికిఁ దెచ్చితివిరా?

నాయ—అమ్మా! ఈతఁ డేమి చేసినాఁడే! పూర్వముగూడ నీశరీర
మిటువంటిదే.

గీ. ఎముకలును గ్రొవ్వు రక్తమాంసములప్రోవు
లావరించిన చర్మము నంతె కాక

యేమి శోభ ఘటించెడి నీశరీర
మెపుడు బీభత్సదర్శనమే! మదంబ!

గరు—మహాత్మా! నరకానలజ్వాలలు చుట్టుముట్టినట్లు దుఃఖ మనుభవించుచుంటిని. దీనికి నివారణోపాయ మేదియును దెల్పవా?

నాయ—తండ్రిగా రనుమతించినచో వీని పాపమునకు నిష్కృతి దెల్పెదను.

జీమూ—నీయిష్టము.

నాయ—వైనతేయా! వినుము.

గరు—(మోఁకటించి శిరస్సు ననంజలిబంధించి) ఆజ్ఞాపింపుము.

నాయ—వినుము.

మ. అనుతాపంబు వహింపు మీపయిని సత్వాఘాతకు లాత్మను మొ
య్యనఁ బుణ్యాపగ సేకరింపు మభయంబారీతి వర్తింపు మీ
ఘనహింసాఘము దాన లీనమగుచున్ గన్పింపఁ బో దప్పగ
ల్లున గంభీరజలాశయంబునకు నేలోపంబునే న్గలునే?

గరు—నీ వాజ్ఞాపించినట్లే.

గీ. ఆవరించినట్టి యజ్ఞానతిమిరంబుఁ
గూల్చి నన్ను మేలుకొల్పినావు
ప్రతినవట్టినాఁడఁ బ్రాణిహింసారతి
నిదిమొదలుకొని విరమించుకొంటి.

ఇంక,

మ. పులినాభోగఫణాలు ద్వీపములు సొంపున్గాంచఁగా నొక్కచో
వలయంబు ల్వడుమేను లొక్కపరి నావర్తంబులై తోఁప నా
వల వేఱొక్కపు డీవలావలకుఁ బోవన్ సేతువై తోఁచుచుఁ
జలధిన్ బాములు తిర్గగావుత మహాసౌఖ్యంబు పెంపారఁగన్,

మఱియును,

మ. పదముల్ తాఁకి నటింప నీలకబరీభారంబు సిందూర మ
భ్యుదయార్కద్యుతిఁబోలెఁ జెక్కుఖులపై నొప్పారఁగా దస్సియున్
మదిలో నెంచక చందనాటవులఁ బ్రేమన్ భోగినీకాంత ల
భ్యుదయంబంచును బాడుచుంద్రు భవదీయోదంత మత్యాంతమున్.

నాయ—మహాత్మా! బాగు బాగు! నీనిశ్చయము నాకుఁ బరమా నందముఁ గూర్చుచున్నది. ప్రతిజ్ఞమాత్రము చెల్లించుకొనుము. (శంఖచూడునిఁ జూచి) శంఖచూడ! నీవును నీగృహమునకుఁ బొమ్ము.

శంఖ—(నిశ్వసించి యధోముఖుఁ డగును)

నాయ—శంఖచూడ! సత్వరమే పొమ్ము.

గీ. పక్షిరాట్చంచుకోటిఁ జీల్పంగఁబడితి
నీవు చనిపోతి వనుచు నూహించుకొనుచు
నేకధారగ నీతల్లి యేడ్చుచుండు
నామె జీవింపదేమొ? నీ వరయఁ బొమ్ము.

వృద్ధ—(కన్నీటితో) గరుడముఖమునఁ బడియు నక్షతశరీరుఁడైన తన యునిఁ జూచుట కాతల్లి యెంత ధన్యాత్మురాలో కదా!

శంఖ—అమ్మా! కుమారుఁడు స్వస్థుఁడయ్యె నేని నీవనినమాట సత్యమే యగును.

నాయ—(వేదన నటించుచు) పరార్థసంపాదనాకాంక్షి నగుటచే నింత వఱకుఁ గాన్పింపకున్నను బాధ యిప్పుడు మర్మచ్ఛేద మగు చున్నది. (మరణావస్థ నటించును)

జీమూ—నాయనా! ఏమిచేయుచున్నావు?

వృద్ధ—ఏమనుచున్నాఁడు.(అొమ్మ బాఁదుకొనుచు) రక్షింపుఁడు రక్షిం పుఁడు. నాపుత్రుఁడు విపన్నుఁ డగుచున్నాఁడు,

నాయి—ఆర్యపుత్ర ! నన్ను విడిచిపోవుట న్యాయము కాదు.

నాయ—(అంజలిఘటింప నిచ్ఛగించుచు) శంఖచూడ ! చేతులు దగ్గఱగాఁ జేర్పుము.

శంఖ—(అట్లే చేయుచు) ఎంతకష్ట మెంతకష్టము. జగ మనాథీకృత మగుచున్నది.

నాయ—(కొంచెము కనులువిప్పి చూచుచు) అమ్మా! నాయంత్య ప్రణామములను గయికొమ్ము.

చ. క్రమముగఁ జేతనత్వము తొలంగుచునున్నది గాత్రమందుఁ గ
ర్ణములకు విస్ఫుటంబుగ వినంబడకున్నది మీవచస్సు నే
త్రములు తమంత మూసికొనెఁ దండ్రి! వశమ్మునుదప్పె నాకుఁ బ్రా
ణము లికఁ నిల్వనేరవు బ్రణామములన్ గయికొమ్ము పేర్మిమై.

ఇవి యన్నియు నెందులకు?

గీ. అసువు లొసఁగి యిప్పు డహిరక్షణమ్మును
జేసినట్టి పుణ్యసిద్ధివలన
భవము లలరునేని పరహితార్థమ్ముగాఁ
గాయ మలరుచుండుఁగాక నాకు.

(పడిపోవును)

వృద్ధు—హా పుత్ర! హా గురుజనవత్సల! ఎచటకుఁ బోవుచుంటివి. నాకు సమాధాన మీయవేమి ? లోచనానంద ! జీమూతవాహన! మరల నీదర్శన మెట్లగును ?

జీమూ—పుత్రా ! జీమూతవాహన ! హా నిఖిలజనవత్సల ! సర్వగుణ నిధీ ! ఎచటకుఁ బోయితివిరా ! పలుక వేమి?

(చేతినెత్తి) అతికష్ట మతికష్టము.

చ. కరుణకుఁ దావులేదు తుది గాంచెను ధైర్యము దానదీక్ష కె
వ్వరు శరణంబు శాంతికి నివాసము కూలె నశించె దాంతి యొ

వ్వరిదరిఁ జేరునో వినయభాగ్యము సత్య మసత్య మయ్యె నీ
మరణమువల్ల లోకముసమస్తము శూన్యతఁ గాంచెఁ బుత్రకా!

నాయి—ఆర్యపుత్ర! నన్ను విడిచి యెట్లు పోయితివి? కరుణాహీనురాలా! వజ్రకఠినదేహా! మలయవతీ! ప్రాణనాథుని విడిచి యెట్లు జీవించుచుంటివే?

శంఖ—హా! నిష్కారణపరోపకారవ్రత! నీప్రాణములకంటెఁ బ్రీతిపాత్రుఁడగునన్ను విడిచిపోయితివా? అవశ్యము నిన్ననుసరింతును.

గరు—ఈమహాత్ముఁడు చనిపోయినాఁడు. ఇప్పు డేమి చేయుదును?

వృద్ధు—(కన్నీటితోఁ బైకిఁజూచుచు) భగవంతులగు లోకపాలులారా! నాపుత్త్రు నమృతముజిలికియైన జీవింపఁ జేయరా?

(సంతోషముతోఁ దనలో)

గరు—అమృతసంకీర్తనమొనరించి యీమె బాగుగా జ్ఞాపకముచేసినది. అపయశస్సు తొలఁగుమార్గము దొరకినది. త్రిదశపతి నభ్యర్థించి యాతఁడొసఁగినయమృతము వర్షించి జీమూతవాహనునే కాక పూర్వభక్షితాస్థిశేషులగు పన్నగులనుగూడ నుజ్జీవింపఁ జేయుదును.

నాప్రార్థన మాతఁడు త్రోసిపుచ్చినయెడల,

సీ. సంపాతకలితపక్షస్పర్శనోద్ధతి
నుదకనాథుని ప్రక్క కొత్తిగించి
యస్మద్విలోచనాయతఘోరవహ్నిచే
ద్వాదశాదిత్యులదర్ప మడఁచి
చంచూగ్రమున నిర్జరనాథువజ్రమ్ము
గాడగాఁ బొడిచి ముక్కలుగఁ జేసి
యక్షనాథునిగద యంతకుదండంబు
ఖరనఖంబుల నుగ్గుగా నొనర్చి

గీ. పలుముఖంబుల వచ్చు దేవతలనెల్ల
గదనమునఁ గాందిశీకులుగా నొనర్చి
వెనుదిరిగివచ్చి క్షణములో పీనిమీఁద
నలరఁ జేతు సుధామయమైనవృష్టి.

(అని సాటోపముగాఁ బరిక్రమించి నిష్క్రమించును)

జీమూ—వత్సా! శంఖచూడ! ఆలస్యము చేయుచుంటి వెందులకు? దారువుల సేకరించి పుత్రునకుఁ జితి పేర్చుము. మేమును వాని ననుసరింతుము.

వృద్ధ—పుత్రా! శంఖచూడ! మేము లేకపోయినచో నీపుత్రుఁడు దుఃఖించును.

శంఖ—(కన్నీటితో) చిత్తము. నేనే మీకు దారిఁ జూపింతును. (లేచి చితి పేర్చి) తలిదండ్రులారా! చితి సిద్ధమైనది.

జీమూ—అతికష్ట మతికష్టము.

మ. తల నుష్ణీషము నూర్ణమున్ బొమలమధ్యన్ వెల్గెడిన్ లోచనం
బులు పద్మాలఁట యొమ్మ కేసరియురమ్మున్ గేరుఁ జక్రాంకిత
మ్ము లహో చేతులు కాని నా యఘ మిదేమో? నీవు విద్యాధరో
జ్జ్వలరాజ్యాధిపతిత్వమున్ గనక యే స్వర్గమ్ముఁ గాంక్షించితే!

దేవి—ఇంకను నేడ్చెద వెందులకు? రమ్ము చితి నధిరోహింతము.

నాయి—అమ్మా! గౌరి! నీభర్త విద్యాధరచక్రవర్తి కాఁగలఁ డంటివి. నే నభాగ్యురాల నగుటచే నీమాటగూడ వమ్మైనదా?

(అంతట ససంభ్రమముగా గౌరి ప్రవేశించును)

గౌరి—మహారాజా! జీమూతకేతు! త్వరపడి సాహస మొనర్పకుము.

జీమూ—(చేతులు జోడించి) గౌరీదేవియే ప్రత్యక్షమైనది. ఈమె దర్శన మమోఘము.

గౌరి—(మలయవతి, నుద్దేశించి) అమ్మా! మలయవతి! నామాట యనృత మెట్లగును? (కమండలూదకముఁ జల్లి)

గీ. నీవు జీవితమే యిచ్చి నిఖిలజగతి
కుపకృతిని జేసినాఁడ వత్యూర్జితముగ
నందుచే నాకు సంతసమయ్యె మిగుల
వత్స! జీమూతవాహన! బ్రతుకు మింక.

నాయ—(లేచును)

జీమూ—(సంతోషముతో) దేవి! మనభాగ్యము పండినది. కుమారుఁడు మరల జీవించినాఁడు.

వృద్ధు—గౌరీదేవిదయవలన.

నాయ—(గౌరిని గాంచి కృతాంజలియై) అమోఘదర్శనయగు గౌరీదేవియే యవతరించినదా ?

క. గిరిపుత్రి! కామితాధిక
వరదాయిని! సతతమోనివారిణి! విద్యా
ధరలోకవందితా! నీ
చరణంబులకున్ బ్రణామశతములు తల్లీ!

(అని గౌరీదేవిపాదములపైఁ బడును. అందఱు నాకసమువంకఁ జూతురు)

జీమూ—మబ్బులేనివర్షము కురియుచున్నది. అమ్మా! గౌరీ! ఇది యేమి?

గౌరి—రాజా! జీమూతకేతు! పశ్చాత్తప్తుఁడగు గరుత్మంతుఁడు జీమూతవాహను, నస్థిశేషులగు పన్నగపతులను బునరుజ్జీవింపఁ జేయుటకు దేవేంద్రలోకమునుండి యమృతవర్షము గురియుచున్నాఁడు. (చేతితోఁ జూపి)

మ. తలలందున్ ఘనరత్నదీధితులు చిందన్ దేహము ల్దాల్చి భూ
స్థలి జిహ్వాద్వితయంబుచే నమృతతాత్పర్యంబునన్ నాకుచున్
మలయాఖండనదీప్రవాహములచందం బొప్ప నాగేంద్రముల్
జలధిన్ జేరఁగఁ బోవుచున్నయవి వక్త్రాధ్వమ్ములన్ గాంచితే.
(నాయకుని జూచి) వత్సా! జీమూతవాహన! జీవితమాత్రదానంబుచే నాకుఁ దృప్తి చేకూరకున్నది.

మ. మనమం దెన్నినమాత్ర వచ్చె మణికుంభ స్నిగ్ధసంపూర్ణపా
వనహంసాహతహేమపంకజరజోవ్యాకీర్ణతోయంబు లో
యన్న నేనే యభిషేకము న్సలిపి నీయందున్న సత్త్వముచే
నిను విద్యాధరచక్రవర్తిపదవీనిష్ణాతుఁ గావించెదన్.
మఱియు,

గీ. హేమమయచక్రరత్న మిా శ్యామహయము
నాల్గుదంతము లలరు దంతావళంబు
మలయవతి ముందుగా నేఁగఁగలరు నీకు
సరిగఁ గనుఁగొను మిామణుల్ చక్రవర్తి!

శారదశశాంకధవళములైన వాలవ్యజనములఁ జేత ధరించి మణిమరీచిక లింద్రచాపముల రచింప నొఁదలలు వంచి మతంగహతకుఁడు మొదలగు విద్యాధరపతులు వంగి నమస్కరించుచున్నారు చూడుఁడు. ఇంకను నీకుఁ గావలసినప్రియ మేదియో తెల్పుము.

నాయ—ఇంతకంటె నాకుఁ బ్రియ మేమున్నది.

సీ. శంఖచూడుఁడు ఖగస్వామి చంచువునుండి
హింసింపఁబడక రక్షింపఁబడియె
నౌద్ధత్యమును బాసి యహిరాజవిద్వేషి
సత్త్వహింసారతిఁ జంపుకొనియె

నతనికిఁ బూర్వ మాహారమై సమసిన
పాములు తిరిగి జీవములఁ బడసె
నాతల్లిదండ్రులు నాపునర్జన్మంబు
కతమునఁ జచ్చియు బ్రతికినారు
గీ. శత్రుకరగతమైన రాజ్యము లభించి
చక్రవర్తిపదం బిది సంతరించెఁ
గాంచితిని నిన్ను సాక్షాత్తుగా మదంబ!
యింతకన్నను బ్రియము నా కేమి వలయు.

అయిన నిట్లగుఁగాక!

భ ర త వా క్య ము

చ. కురియుత మేఘముల్ నెఖిలిగుంపునటింప సకాలమందు ను
ర్వర సకలంబు కన్నులకుఁ బచ్చనిపైరుల విందొసంగు మ
త్సరముచు మాని యాపదలు దారక బాంధవమిత్రగోష్ఠిలో
వఱలుచుఁ బుణ్యమున్ ప్రజ లపారముగా గడియింత్రు గావుతన్.

ఇది పంచమాంకము

సర్వమును సంపూర్ణము.

శ్రీచింతామణీప్రెస్, రాజమండ్రి. ఇ. జి, 36 3-7-47 కా॥ 100
శ్రీ తిరుపతివేంకటేశ్వర బుక్ డిపో; రాజమండ్రి. ఇ. జి 20